తీరికవుతుంది ? పైగా పెళ్ళయివేటు ప్రాక్టీసాయె" అంటూ మౌళి ఎదురుగా కుర్చీలో చతికిల బడిందామె.

చివాలున లేచి బట్టలు మార్చుకు బేగ్ చేతిలోకి తీసుకుని "వెళ్ళివస్తాను మంజూ" అన్నాడు మౌళి.

పెళ్ళయి మూడు నెలలు దాటింది. తర్వాత ఇదేచూడడం. పెళ్ళికి వెళ్ళడం కావాలనే మానేసింది. అతను జయంతి గురించేమైనా చెప్తే వినాలనిపించింది కాని బైటకుదరదు. అలా అన్పించి కాబోలు మంజుల ఒక్క క్షణం చిన్నబోయి మళ్ళీ మామూలు నవ్వు పెదవులపై కదుల్తూ ఉంటే "సరె వెళ్ళు మౌళీ. జయంతిని అడిగానని చెప్పు. ఓసారి తప్పక తీసుకురా !" అంది.

"నువ్వేరారాదూ !" నిష్ఠురంగా ధ్వనించింద తని గొంతు. "అలాగే జయింతిని చూడాలనేగా. శ్రావణ మాసం నోముకి అక్కయ్య దగ్గర కొస్తుందిగా చూస్తా."

"మా ఊరు రావన్న మాట."

"అలానేలే వెళ్ళు బస్సు మిస్సవుతుంది"

ఆయిపోయింది మంజులను చూసి రావడం. ఇంటికి వచ్చే సరికి రాత్రి ఎనిమిదయింది. ఎంతకాలమయో వెళ్ళిపోయిన భర్త తిరిగి వచ్చినట్టు చూసింది మౌళివైపు జయంతి. అతని చేతిలో బాగ్ ఉంటే చంద్రయ్యను షాపుకు పంపే దాననే" అంది.

అతను జవాబు చెప్పలేదు.

"స్నానంచేస్తారా ?" అడిగిందామె.

"పనివాళ్ళెవరూ ? లేరా" చిరాగ్గా చూశాడామెవైపు.

"నేను నీళ్ళు బాత్ రూమ్‌లో పెడతాను" అంటూ బాయిలరు అంటించి నీళ్ళు కాచి గబగబా వంటచేసింది.

ఆప్యాయతగా వడ్డన చేస్తున్న జయంతి వైపు చూశాడు అతనివైపు చూస్తున్న ఆమె చప్పున చూపులు వాల్చింది.

అతనికి నవ్వొచ్చింది. పెళ్ళయి మూడు నెలలు దాటింది. రెండు నెలల నుంచీ వండిపెడుతూంది. కాని ఇంకా సిగ్గుపోలేదు. అవును తను ఆమెసిగ్గు సడలిపోయేలా ప్రవర్తించాడా ? తమను ఏమీ తృప్తిపరచకపోయినా, కొట్టి తిట్టి హింసించినా తాళి కట్టిన భర్తను గుడ్డిగా ప్రేమించడం, మనదేశ సాంప్రదాయం కాబోలు. లేక ఈ గడ్డపై పుట్టిన స్త్రీల స్వభావమో మరి ! ఒక్కక్షణం ఆమె వైపు జాలిగా చూశాడు.

ఆ రాత్రి ఆమె గురించి కొంచెంసేపు ఆలోచించాడు. మౌనంగా తనకు కావాల్సిన స్నానం కాఫీ టిఫినూ భోజనం గబగబా అమర్చి తన కని నిర్ణయించిన గదిలోకి తప్పుకుంటుంది. ఏ ఏనాటి




ఏన్నా నాలో మార్పు వస్తుందనే అశ కాబోలు. నా మనస్సు మంజుల సమక్షంలో చలిస్తుంది. పరవసిస్తుంది. కాని ఏ స్త్రీసమక్షంలోనూ చలించదు. జయంతి అందమైనదే కాని తన నాకర్షించి వశపరచుకునే శక్తి ఆమెలో లేదు. కాని పూరించిన మేఘంవర్షించినట్టు ఎప్పుడో ఒకనాడు జయంతి బయట పడిపోతుంది అప్పుడు తానేం చెయ్యాలి?చిరాగ్గా జుట్టు పీక్కున్నాడు. కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. బలవంతాన నిద్రకుపక్రమించాడు.

శ్రావణమాసం నోమంటూ శాంత జయంతిని తీసుకువెళ్ళింది. జయంతిని చూడానికి వచ్చిన మంజులను చూడాలనే ఉద్దేశ్యంతో మౌళి వెళ్ళాడక్కడికి.

అతను వీధి వరండా మెట్లెక్కుతున్నాడు. సంతోషంగా గలగలా ఇద్దరు యువతులు కలిసి నవ్వే నవ్వులు విన్పిస్తున్నాయి. అప్రయత్నంగా కిటికీ లోంచి లోపలికిచూశాడు. మంజులా జయంతీ ఆశ్చర్యపడ్డాడు

వీ రిద్దరిమధ్యా ఇంతచనువెలా వచ్చింది? ఇద్దరూ ఓవయసువాళ్ళు కావడాన్నకాబోలు. తొందరగా కలసి పోయారు పెళ్ళయి గడచిన ఇన్ని రోజుల్లో తనఎదుట నవ్వు రాదన్నట్లు గంభీరంగా ఉండిపోయే జయంతి

ముంజుల ఓబుల్లిచిప్ప హాయిగానవ్వు తూంది. తనతో అస్సలు మనస్సువిప్పి మాటలే మానేసిన మంజుల జయంతితో కలసి హాయిగానవ్వుతోంది. తానా నేరస్థుడు? వారిద్దర్నీ ఓచోటచూచిన మౌళిలో అసూయలాటిది రేగింది.

గబగబావంటఇంట్లో ఉన్న వదిన దగ్గరకెళ్లాడు. అతన్ని చూస్తూనే జయంతీ మీ ఆయనొచ్చాడు కేకేసింది శాంత.

"మంజూ మీ ఆయనవచ్చాడు" అనే ఆమె పిలుపువిని ఓ నాడు పరవశించిన అతని హృదయంలో ఈ నాడు అదే కంఠం ఇలా పిలుస్తూంటే సన్నని మంటలు లేచాయి.

అతను అక్కడ ఉన్న ఆరోజు అచ్చంభార్యలా ప్రవర్తించిన జయంతి వైపుతెల్లబోయి చూడ్డంమినహా ఏమీ అనలేకపోయాడు కాని రాత్రేమిటి జరగబోతుందో అనేభయంతో అర్జంటు కేసులున్నాయంటూ ప్రయాణమయ్యాడు. ఆరోజు మంజుల అతనితో మాట్లాడినది ఒకటి రెండు పొడిమాటలే. జయంతి చనువూ మంజుల ముభావం అతనికి చాలా బాధగా ఉంది. వెళ్ళిపోవాలను కున్నాడు కాని బస్సు మిస్సయిపోయింది. తిరిగివచ్చాడుమౌళి.

అతను భయపడుతున్నట్టుగానే పాల గ్లాసుతో రాత్రితొమ్మిది గంటలవేళ గదిలోకొచ్చింది జయంతి. "ఇవ్వాళ స్తూంటె నాకుఅసహ్యమనిపిస్తూంది. పగలల్లా ఊపురితీసుకోకుండా వెంట వెంట తిరిగావు. నా ఖర్మ! పోదామని అనుకుంటే బస్సు మిస్సయిపోయింది. శనిలా రాత్రికూడా..."

"ఎమండీ!" అతని మాటకడ్డువస్తూ రోషంగా తలెత్తి అతని వైపుచూసింది జయంతి. క్షణంతర్వాత నీళ్ళునిండిన కళ్ళతో అలాగే చూస్తూ! క్షమించండి, మీరూ నేనూ ఎంతో అన్యోన్యంగా కలసి బ్రతుకుతున్నట్టు నటించాల్సి వచ్చి నందుకు విచారిస్తున్నాను. ఎందుకనో మీ మీద మీ ఇంట్లో వారికే ఓ అనుమా నాలున్నట్టు గ్రహించాను. పెళ్ళికాక పూర్వం ఎవరి ఉద్దేశాలెలాఉండేవో నాకు తెలియదుగా. అదృష్టమో దురదృష్టమో పెళ్ళిజరిగిపోయింది మీ మీద మీవాళ్ళూ నా మీద నా తలితండ్రులూ ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. వారిని సంతోష పెట్టడంకోసమైనా నటించడం మన కనీస ధర్మంకాదంటారా? మీకు కష్టం గా ఉంటే రేపు ఉదయాన్నే వెళ్ళిపొండి. కాని ఈరాత్రి ఈ గదిలోనే నిద్రపోతాను. అంటూనే మూలనున్న చాప పరచుకుంది జయంతి.

అమె టేబిల్‌పై ఉంచిన పాలుగటగట తాగి ఒక దిండు అమె దగ్గరపడేసి, మంచంమీద పడుకొని గోడవైపుతిరిగి కళ్ళుమూసుకున్నాడు మౌళి.

మంజుల దాచుదామన్నా దాగనినిజం




మౌళి గ్రహించాడు. ఉదయం నిద్ర లేచిన మంజుల వదనం పీక్కుపోయి, ఏడ్చినట్టు కనురెప్పలుబ్బి ఉన్నాయి. కాని తానేంచెయ్యగలడు! తామిద్దరికీ మధ్య జయంతి ఇనుపగోడలా దాపురించింది. అర్థంలేకుండా జయంతిమీద కోపంవచ్చింది మౌళికి.

బూటు కాలితో ఆమెపక్కలో పొడుస్తూ, "ఎప్పుడు తయారవుతావక్కడికి? అన్నాడు.

మగతనిద్రలో ఉన్నజయంతి తృళ్ళి పడి తానెప్పుడూచూడని అతని ఆకారం, కోపం, ఆకంఠంలోని కరకుతనం. వీటికి కారణమేమిటో గ్రహించలేక, "మీరెప్పుడురమ్మంటే అప్పుడు" అంది లేచి నించుంటూ వినయంగా.

తననుతాను తెల్సుకున్నాక అన్నాడు మౌళినెమ్మదిగా, "నీ ఇష్టం, నేను వెళ్తున్నాను" అంటూ.

మౌనంగా అతని వెనుక ఇవతలికొచ్చింది జయంతి. వెనుదిరిగి చూసిన మౌళిగ్రహించాడు. జయంతి మొహం మంజుల మొహంలాగే ఉంది. తానెందుకొచ్చాడిక్కడికి!

రోజులు దొర్లిపోతున్నాయి. తనకై తానెప్పుడూ కల్పించుకొని మాట్లాడదు జయంతి. మౌళి ఏమన్నా ఇంటికి సంబంధించిన విషయాలడిగితే పొడిగా సమాధానం చెప్తుంది. అతను డిస్పెన్సరీనుంచివస్తూ, కోటుజేబులోనుంచి ఆ రోజు తానుసంపాదించిన డబ్బు తీసి పట్టుకు నించుంటాడు. ఆమె కాఫీగ్లాసు

అన్నుంది. ఈ ఫగ్గాను తీసుకుని, ఈ డబ్బు జాగ్రత్త పెట్టు అవసరమైతే ఖర్చుచెయ్యి. అంటూ ఆమెకిస్తాడు.

అతని ఎదరే బీర్వాతెరచి భద్ర పరుస్తుంది జయంతి.

ఎప్పుడూ జయంతికీ, మూర్తికీ మాత్రమే ఉత్తరాలువ్రాసే బలరామయ్య మౌళికి వ్రాశాడు, వ్రతముంది భార్యను తీసుకురమ్మని. ఉత్తరంతోపాటు కామే శ్వరమ్మ పోయిందనీ మంజుల అక్క డికి వచ్చి వెళ్ళిపోయిందనీ వ్రాసిన శాంత ఉత్తరమూ అంది, మౌళికేదో సంతోషంగాఉంది. మంజుల దగ్గరకు వెంటనే వెళ్ళిపోవాలనిపించింది.

"నిన్నేదో నేను కట్టడి చేస్తున్నట్టు మీ నాన్న నాకు వ్రాశారు ఉత్తరం, పండక్కి నిన్నుపంపించమని. వెళ్తావా? అడిగాడు జయంతిని. తానొచ్చి ఐదు మాసాలు కావస్తుంది మూర్తి శాంత కూడా ఎన్నోసార్లు ఓసారి వెళ్ళిరామ్మా అంటూ ఉత్తరాలు వ్రాశారు, కాని తానే మొండిగా వెళ్ళనంటూ కూర్చుంది. తల్లీ తండ్రీ అన్నా వదినా అందర్నీ ఓ సారి చూడాలనిపించిన జయంతి "మీరు రారా?" ప్రశ్నించింది.

"ఉహూ. నాకు కుదరదు. నువ్వు వెళ్ళు. నీకు కావాల్సిన డబ్బుతీసుకు వెళ్ళు అన్నాడు మౌళి, ఆ సాయంత్రమే సంతోషంగా పుట్టింటికెళ్ళింది జయంతి.

మర్నాటి ఉదయం ఉరకలువేసే ఉత్సాహంతో మంజుల దగ్గరకి ప్రయాణ మయ్యాడు మౌళి.

నీలం ప్రింటు పువ్వులచీరా, అదే కలర్ జాకెట్టులో పాలరాతి బొమ్మలా ఉన్న మంజుల వైపు పరవశంగా చూస్తూ, ఎంతహాయిగా సంతోషంగా బ్రతికేస్తు న్నావ్?" అన్నాడు మౌళి ఆమెను కవ్వించాలని

"ఏం అసూయగా ఉందా? తీరికుంటే అత్తవారింటికి వెళ్ళాల్సింది, ఇలా వచ్చా వేం?" ప్రశ్నించింది అతని వైపుచూడ కుండా. "తీరికుంటే సంతోషంగా గడ పాలిగా! నాకు సంతోషం ఎక్కడ లభి స్తుందను కుంటానో అక్కడి కొచ్చాను" ఆమె వైపు కొంటెగా చూస్తూ అన్నాడు మౌళి.

"మౌళీ! హద్దులు మీరి మాట్లాడకు. ఇక్కడ నీకు సంతోషాన్నిచ్చే వారెవరూ లేరు. భార్యను కాదని. ఆమెను వదలి రావడం నీకెలా ఉందో! నాకుచాలా సిగ్గవుతూంది..."

"ఎందుకని?"

"భార్యను అక్కడ వదలి, ఇక్కడ వంటరిగా ఉన్న నాదగ్గరకొస్తే నలుగురూ ఏమనుకుంటారు?"

"నలుగురితో నాకుపనిలేదు "

"కావచ్చు. నాసంగతి?"

"నీకూ అవసరంలేదు "

"మొండిగా మాట్లాడకు. నీభార్యను నీవు సంతోషపెట్టిననాడే నాఇంటికి

వచ్చినా. నాతోమాట్లాడినా నీకుగౌరవ మిస్తాను."

"ఆమెను సంతోష పెట్టలేదని ఎలా అనుకుంటున్నావ్? ఆమె ఏమన్నా చెప్పిందా?"

"దొరికి పోయావ్! ఆమెను అను మానిస్తున్నావ్! ఆరోజు. అంటే శ్రాక్య్యగారింట్లో మీ ఇద్దరి సంభాషణా విన్నాను"

"ఛ. ఛ. అబద్ధం. మేమేమీ మాట్లాడు కోలేదు." దబాయించాడు.

"అబద్ధాలాడకు. బస్ తప్పిపోయి ఇంటికివచ్చాక నీ గదికి జయంతి వచ్చింది గుర్తుందా!"

"నువ్వలా వినడంతప్పు."

"కావచ్చు. కాని...మీఅనుబంధం ఎలాటిదో. తెలుసుకోవాలనిపించి... ఆమెను సరిగా చూసిన్నాడే...నాతో మాట్లాడు. వెళ్ళిపోమ్మాళి నిన్నుచూస్తుంటే బాధైపోతుంది, పిచ్చిదాన్నయి పోతాను"

"నిన్ను చూడకుండా నేను పిచ్చి వాణ్ణయి పోతున్నాను. నీకుదూరంగా ఉండలేక పోతున్నాను."

"అయితే ... అయితే ... ఇప్పు డేమిటిచేస్తావ్!" ఆవేశపడింది మంజుల.

"అనవసరంగా ఫీలవకు మంజూ... ఏమోఅనుకున్నాను కాని...నువ్వునాకు కావాలి. అల్లాగేనేను నీకూ...నువ్వు కాదన్నా. అది నిజం. అందుకోసం..."

"అందుకోసం?"

"ప్రేమికులుగా ఉండిపోదాం... నన్నుకాదనకు."

"ఛి. ఛీ. నోర్ముయ్...నేను నీకు ఉంపుడు కత్తెనా. సాటి స్త్రీకి ద్రోహం చేసేంత నీచురాలినా నేను! ఈఉద్దేశ్యంతో వచ్చేవని ఊహిస్తే నాగడప త్రొక్క నిచ్చేదానను కాను."

"మంజూ !!!"

"అవును. ఇప్పుడయినా మించి పోయిందిలేదు. వెళ్ళు..."

"వంటరిగా ఉన్నావు నిన్నేమన్నా చెయ్యగలను."

"అదేనేనూ చెప్తాను "

"నువ్వేం చెయ్యగలవు?" నవ్వేడు అసహనంగా.

"నన్ను అల్లరి పాలుచెయ్యకు మౌళీ వెళ్ళిపో...నిన్ను ప్రార్థిస్తున్నాను... నాకునీతిగా బ్రతకాలనుంది. నలుగురూ వేలెత్తిచూపే జీవితంనాకొద్దు...అందు కని వెళ్ళిపో మౌళీ." లావాలా ఆమె గుండెలో దాగి ఉన్న ఆవేదన అసు రూపంలో ప్రవహించసాగింది.

ఆమె కన్నీరుచూసిన మౌళి జాలిగా ఆమెవైపు చూస్తూ"నన్ను వెళ్ళి పొమ్మన్నావా? మంజూ" అన్నాడు.

"అంతకన్నా ఏమీ కోరలేని నిర్భాగ్యురాలను మౌళీ"

అతను వీధిగేటు దాటాడు

ఆమె భళ్ళున తలుపులు వేసుకుంది.

లెటర్సు చూసుకుంటున్నాడు మౌళి. తాను కులాసాగా ఇంటికి చేరాననీ. అత్తమామలు అల్లుడు రానందుకు నొచ్చుకున్నారనీ, వీలైతే ఓ సారి రమ్మనీ జయంతి ఉత్తరం.

తర్వాత. మూర్తి వ్రాసిన ఉత్తరం తనకీ శాంతకీ వంట్లో బాగుండక మందులు వాడుతున్నామనీ, పాప పండక్కి మంచి బట్టలు కావాలంటూంది, అత్యవసర పరిస్థితుల్లో కొంత అప్పు అయింది. తీర్చమని వత్తిడి చేస్తున్నారు. ఏమీచెప్పలేక పోతున్నాను. ఈ ఒక్క సారీ కొంచెం సాయంచేసి నాగౌరవం కాపాడతావని ఆశిస్తాను. ప్రాధేయ పూర్వకంగా వ్రాసిన ఉత్తరం. ఇతని గౌరవం కాపాడాలట. అతనికి తెలియ కుండానే పళ్ళు కరకరలాడాయి. ఉతరం ఉండచుట్టి డ్రాయరు సొరుగులో తోశాడు.

అతని కప్పుడు అన్నా వదినలు మంజుల. కట్నమిచ్చిన మామగారూ, రమణయ్యా. జయంతీ ఇందరూ తన జీవితం నాశనం చేసిన రాక్షసుల్లా కన్పించారు. అందరినీ చంపెయ్యాల న్నంత కోపం వచ్చింది......మంజుల తనను పొమ్మంది...తల గోడకేసి టక టకా కొట్టుకున్నాడు.... ఇలా నలిగి... బాధపడి...మనోవ్యధతో బ్రతికే కన్నా ఏదన్నా పాయజను మింగి చస్తే... గదికి తాళంపెట్టి హాస్పిటలు కెళ్ళాడు.

బ్రతుకుమీద తీపితో. బ్రతకాలనే ఆశతో. తనవైపు ఆశగాచూసే ఎన్నో దీనమైన కళ్ళు... వీళ్ళందరూ ఎందుకు బ్రతకాలను కుంటున్నారు? వీరందరికీ బ్రతుకులో బాధలూ, దారిద్ర్యం, ఓట మీ...ఏవీలేవా! ఉండవచ్చు. కాని తనలా భగ్న ప్రేమికులు కారేమో!

తానెందుకు చచ్చిపోవాలి?...మంజుల బ్రతుకుతూందే?. చాలీ చాలని జీతంతో అప్పులతో అనారోగ్యంతో అన్నయ్యా ఎందుకు జీవించాలను కుంటున్నాడు?

మంజుల, తాను ప్రాణంగా ప్రేమిం చిన మంజుల...పొమ్మంది...నా ఎదుట తన్ను తాను నిగ్రహించు కోలేక... మరి వెళ్ళను...మంజులను మరి ఏడి పించను...అనుకున్న అతని కళ్ళలో నీటిలెర కప్పింది.

*　　*　　*

"అయ్యా గారూ?" అతని గత స్మృతులు చెదరిపోయాయ్.

హాస్పిటలు కెళ్ళాలి. టైమయింది అనుకుంటూ డ్రెస్ మార్చుకున్నాడు. కాఫీ గ్లాసు అందిస్తూ "తొందరగా వచ్చెయ్ భోజనానికి" అంది శాంత

"జయంతి ఏమయిందో మనం ఏమీ ఎంక్వయిరీ చెయ్యొద్దా" అడిగాడు మౌళి. మీరెవ్వరూ నాకొద్దు పొండి అంటూనే



తానేం చెయ్యాలో వారి నడిగే అలవాటు,
అతనికి నవ్వొచ్చింది.

"అన్నీ మమ్మల్ని అడిగి చేస్తు
న్నావా?" రోషంగా అంది శాంత.

మౌనంగా తలవంచి బూటు తొడు
క్కుంటూ న్న మౌళి నుద్దేశించి. "మళ్ళీ
జయంతి రావాలను కుంటున్నావా?...
కావాలను కుంటున్నావా?" అంది శాంత
కొన్నిక్షణాల తర్వాత.

"అహ. లేదు." తడబడ్డాడు మౌళి.

"మరి?" నవ్వబోయింది.

"కాదు లే, పాపం ఎక్కడికెళ్ళి
పోయిందో అని"

"ఉహు జాలా!"

"జాలో బాధో... ఆమె డబ్బుతో
మన అప్పులు తీర్చుకున్నాం. హాస్పిటలు
ఓపెన్ చేశాం." అతని గొంతు కరు
కుగా ధ్వనించింది.

"అయితే ఆ డబ్బు తిరిగి ఇచ్చేస్తావా?" కొంచెం కోపంగా అతనివైపు చూసింది. అతను జయంతిని చేసిన నిర్లక్ష్యం గుర్తొచ్చి.

నవ్వాడు పిచ్చివాడిలా। "వదినా? డబ్బుమీద ఆపేక్ష చూపించే వారిని చాలామందిని చూశాను. కాని జయంతికి డబ్బుమీద మమకారంలేదు. తన సొమ్ములన్నీ ఇక్కడే ఉంచేసింది"

ఆమె మాట్లాడలేదు. వెళ్తూ ఆమె వైపు చూసి "ఏమంటావ్?" అన్నాడు మౌళి.

"ఏమంటాను? ఈ ప్రపంచంలో డబ్బుకున్న శక్తి మనిషికి లేదని... ఆ డబ్బు, డబ్బేకదా। రకరకాలుగా మనల్ని గారడీ ఆడించింది। డబ్బు కోసమే కదూ। మౌళీ నిన్నిలా పిచ్చివాణ్ని త్రాగుబోతునీ చేశాను? సమస్యలు సృష్టించేదీ, సమస్యలు పరిష్కరించేదీ డబ్బు... ఇప్పటి సమస్య మాత్రం డబ్బుతో పరిష్కారం కాదు."

"అంటే। ఎలా...ఎలా పరిష్కారమవుతుంది?"

"సరే...వెళ్ళరా, టైమయినట్టుంది" లోపలికి వెళ్ళిపోయింది శాంత.

చాలారోజుల తర్వాత మళ్ళీ తాగి వచ్చాడు మౌళి. ఏమేమో మాట్లాడుతున్నాడు. ప్రతి మాటలో మంజుల... ఒకటి రెండుసార్లు జయంతి.

మర్నాటి ఉదయం ప్రశ్నించింది. "మౌళి అసలు త్రాగుడు ఎందుకు మొదాలుపెట్టావ్?" అని.

"ఇన్నాళ్ళ తర్వాత. ఈ ప్రశ్న అడగాలని ఎందుకు తోచింది?"

"ఏం చేస్తే నువ్వు తాగుడు మానేస్తావో అది చెయ్యాలని"

"బాగుంది. ఇప్పుడెలా। మానలేనేమో।"

"కాదు... మానెయ్యాలి. నే వెళ్ళిపోతాను. నీ దగ్గరెన్నాళ్ళుంటాను. నీకెవరిసన్నా తోడుంచి."

"నాకు తోడా? ఎందుకని। చంద్రయ్య ఉన్నాడుగా। వాడే కాస్త ఉడకేసి పడేస్తాడు."

"కాదు మంజుని కొన్నిరోజులు సెలవుపెట్టి రమ్మంటాను"

"అంటే। ఎందుకు?" అర్థంకానట్టు ఆమెవైపు చూస్తూ అడిగాడు.

"నీ దగ్గర ఉండి..."

"వదినా వద్దు వద్దు... కొన్నాళ్ళు నన్ను విశ్రాంతిగా బ్రతకనీ. మానసికంగా, శారీరకంగా చాలా విసిగిపోయాను. నాకీ జీవితంమీదే విరక్తి వస్తూంది." అన్నాడు ఆమె మాట పూర్తికాకుండా.

"ఏమిటి విశ్రాంతి?... తాగి ఆరోగ్యం పాడుచేసుకుని... సహించను సహించలేను... నా నుంచే నా స్వార్థం నుంచే నీ జీవితం, అమాయకురాలైన

నరక మయ్యాయి... వెళ్ళిపోయింది జయంతి... నువ్వు అక్కర్లేదంది ... మరా ప్రసక్తి వదిలెయ్...కాని..."

"వదినా!"...అన్నాడు సహించ లేనట్టు.

"ఏమిటి నీ ఉద్దేశ్యం మౌళీ! మంజుల మీద ప్రేమే కదా జయంతిని నీ దగ్గర చేరనివ్వలేదు...ప్చ్. గతం వదిలెయ్. ఏదో ఎవ్వరి తప్పో జరిగిపోయింది ... అన్నయ్య ఉత్తరం వ్రాశా రివాళ. మీ సంగతులు మంజులకి తెలిశాయట చాలా బాధ పడుతూ ఉత్తరం వ్రాసిందట ..."

"తన కెందుకు బాధ?" నవ్వాడు విరసనగా.

"ప్చ్. మా అందరికన్నా నీ కోసం బాధ పడ్తూంది మంజులే..."

గల గలా నవ్వి "నువ్వేలా అన్నా మాట్లాడగలవు వదినా! తియ్యని మాట లతో మనిషిని లొంగదీసే శక్తి...మరేం అనుకోకు—నీకు బాగా ఉంది. హాయిగా ఉద్యోగంచేసి సంపాదిస్తూంది. దుక్కలా ఉంది మంజుల, అది నా గురించి బాధ పడుతూందా? మీరు పెళ్ళి ప్రయత్నం చెయ్యలేదు కాని, అలా చేస్తే ఆవెవరి నన్నా పెళ్ళాడుతుంది. ఎలా అన్నా బ్రతికేస్తుంది" నిగ్రహించు కో లే ని ఆవేశంతో అన్నాడు మౌళి. మంజుల గుర్తు వస్తే ఒక్కోసారి జాలీ, ఒక్కో సారి తాను చెప్పినట్టు ఆమె వినలేదని అర్థంకాదు.

"పొరబడుతున్నావ్ మౌళి. నీ పెళ్ళ యిన తర్వాత మంజులకి ఫిట్స్ వస్తు న్నాయి. తావీ జన్మలో పెళ్ళి చేసుకోనని తల కొట్టుకు ఏడ్చింది. బలవంతాన పెళ్ళి తలపెడితే చస్తానంది... నీకు తెలియ దే సంగతీను!!

"ఏరే. ఏది ఏమైనా ... నాకు కొన్నాళ్ళు విశ్రాంతి కావాలి. జయంతిపై ప్రేమా అనురాగం లేదే అనుకో. కాని బట్ట మార్చి బట్ట కట్టుకున్నంత తేలిగ్గా మళ్ళీ పెళ్ళికొడుకుని కాలేను. దయ చేసి మరోసారి ఆ ప్రసక్తి తేకు" ఖచ్చి తంగా చెప్పాడు మౌళి.

మరొక నెలరోజులుండి వెళిపోయింది శాంత. మౌళి మారిపోయాడు. తాగుడు మానేశాడు. మౌనంగా గంభీరంగా ఏదో ఆలోచనలలో మునిగిపోయేవాడెప్పుడూ. అతనికి అక్కర్లేని జయంతి వెళ్ళి పోయింది. తన యింట్లోంచి, తన జీవి తంలోంచి మాత్రమే కాకుండా ఫలానా చోట ఇలా బ్రతుకుతూంది అని తెలియ రాకుండా వెళ్ళిపోయింది ఎటో. తాను కోరుకున్న మంజుల, తాను మనసిచ్చి ప్రేమించిన మంజుల, తనను పిచ్చివాణ్ని అవివేకుణ్ణి, తాగుబోతునీ చేసిన మంజుల అందుబాటులో ఉంది. తాను వెళ్ళి ఆమెను కోరాలి కాని, తామిద్దరిమధ్యా ఏ అడ్డం కులూ లేవు. కాని తానెందుకు మంజుల

వ్యామోహం చచ్చి పోయిందెందుకు? తనలో ఉత్సాహం, సంతోషం, ఇలా తుడిచిపెట్టుకుపోయా యెందుకు? ఏదన్నా తాను చేసిన ఆపరేషన్ సక్సెస్ అయితే చావు బ్రతుకులమధ్య కొట్టుమిట్టాడే ఓ ప్రాణిని కాపాడ గలిగితే, క్షణకాలం దోబూచులాడేది తృప్తీ, సంతోషం. అంతే....మళ్ళీ ఏదో హృదయమంతా ఆవరించుకున్న విరక్తి, గంభీరంగా వదనంలో ప్రస్ఫుటమయ్యేది.

మూర్తి అవసరాలకి డబ్బు కావాలని వ్రాస్తే వెంటనే పంపిస్తున్నాడు పెళ్ళి ప్రసక్తి తెస్తే త్రోసి పుచ్చుతున్నాడు.

ఓ మధ్యాహ్నం ఎండ తీక్షణంగా కాస్తూంది. హాస్పిటలు నుంచి వచ్చిన మౌళి భోజనం చేస్తున్నాడు.

"బావా!" ఎప్పుడో విన్న గొంతు ఉలికిపాటుగా తలెత్తి చూశాడు.

జయంతి అన్న ! మోహన్రావు. ఒక్కసారి తడబాటుగా అయోమయంగా, ఇతనెందుకు వచ్చినట్టు? అన్నట్టు చూశా డతనివైపు మౌళి

"నన్ను మరిచిపోయారా?" మోహన్రావు అమాయకమైన చూపు, మాట, హృదయం ద్రవించిన మౌళి, "అహ...లేదు, రండి కూర్చోండి. ఇదేనారావటం? చంద్రయ్యా" పిల్చాడు.

"నాన్నగారూ, అమ్మా పోయారు నాకు ముగ్గురు పిల్లలు"

గాడు మౌళి. తనకివేలరూపాయలు ఇచ్చిన మామగారు, తన వైపు అప్యాయతగా చూసిన అత్తగారు, ఇద్దరూ. అతని దృక్పథంలో మెదిలి మనసు చివుక్కుమంది. పశ్చాత్తాపంలాటి దేదో అతని తల వాల్చింది.

"నాలుగైదు నెలలయింది నాన్నగారు పోయి. మా చెల్లి వెళిపోయిన నాలుగు నెలలకే అమ్మ పోయింది.. చిక్కుల్లో పడిపోయానండీ." దీనంగా మౌళివైపు చూశాడు మోహన్రావు.

"ఏమిటా చిక్కులు? ఫర్వాలేదు తర్వాత మాట్లాడుకుందాం. స్నానం చేసి భోజనం చెయ్యండి" అన్నాడు మౌళి.

స్నానం భోజనం ముగించిన మోహన్రావు తన సంచీలోంచి కొన్ని కాయితాలు మౌళి ముందర ఉంచాడు" నాన్నగారేవో అప్పులు చేశారట. అప్పులిచ్చారట. కొందరు, మీ నాన్న మాకు ఇంత డబ్బివ్వాలి, ఇల్లు వేలంపాడేస్తాం, అంటున్నారు. ఆ ఊరి కరణం, మునసబు, వారందరూ ఏవో సలహాలిచ్చారు నాకేం తెలియదు, నాకు వాళ్ళ మీద నమ్మకం లేదు"

గతుక్కు మన్నాడీసారి మౌళి. తన మీదా ఇతనికి నమ్మకం, వారి కుటుంబానికి తానేం న్యాయం చేకూర్చాడు? తన కట్నం కోసం అప్పులు చేశారు. తను వారి గారాల అమ్మాయి జీవితం నాశనం




చేశాడు. చెల్లెల్ని వదిలిన బావపై నమ్మకమా, తన వ్యవహారాలు చక్కబరుస్తాడని!

మౌళి మౌనం అర్థంకాని మోహన్రావు, "నాకెవ్వరూ కావాల్సిన వారు లేరండి నా భార్యా దిక్కులేనిదే... అత్తవారూ లేరు."

"నేను వస్తాను లెండి మీతో. మీ వ్యవహారాలు చక్కబరుస్తాను సరా!" అన్నాడు మౌళి అతని వైపు ఆర్ధ్ర హృదయంతో జాలిగాచూస్తూ!

"మీరలా అంటారని నాకు తెల్సు లెండి. మా ఆవిడ వద్దంది మీ దగ్గర కెళ్తానంటే ఇప్పుడు మిమ్మల్నిచూసి ఏమనుకుంటుంది?" నవ్వుతున్నాడు మోహన్రావు ,ఏవేవో మాట్లాడుతూ.

'వెఱ్ఱిబాగుల మనిషి. అమాయకుడు' అనుకున్నాడు మౌళి

మోహన్రావు భార్య లక్ష్మి తెలివైనదే తాను ఊహించని విధంగా ఆడబిడ్డ భర్త రావడం, తమ వ్యవహారాలు చక్కబరచి ఋణవిముక్తుల్ని చెయ్యడమే కాకుండా. తన భర్తను "నా హాస్పిటలెలానూ ఉంది, ఓ మెడికల్ షాపు ఓపెను చెయ్యండి ఆ ఊళ్ళో" అని బావమరిదికి సలహాఇచ్చి ప్రోత్సహించినందుకు మరీ ఆశ్చర్యపోయింది. ఆడబిడ్డ పెళ్ళెలా అయిందో ఆమెకు తెలియదు. ఆమె పెళ్ళయిన మూడు నెలలకు. కట్నం లేకుండా తన అందం తెలివీచూసి మామగారు కొడుక్కి చేసుకున్నారు. బొత్తిగా వ్యవహార జ్ఞానం, తెలివీలేని

తనకు దేవుళ్ళా కనిపించాడు మౌళి.

"ఏదో పీకలమీద ఉన్న వ్యవహారాలు చక్కబరచారు, సంతోషమే కాని ...మీరు మా అప్పులు పదిహేను వేలు తీర్చారని విన్నాను. ఇదేంబాగుండలేదు. మరొక్క నాలుగు రోజులు ఉండి మాకు నాలుగెకరాల పొలం ఉందిగా, రెండెకరాలు అమ్మి పెట్టడం, మీడబ్బు..."

"అహ, వద్దమ్మా. ఇప్పుడు నాకు డబ్బు చాలానే ఉంది. అవసరమయితే అలాగే అడుగుతాను." అన్నాడు నవ్వేస్తూ మౌళి.

ఈ సారి మరీ ఆశ్చర్యపోయింది. పదిహేనువేల రూపాయలు అప్పు తీర్చింది. మళ్ళా వెంటనే వసూలు చెయ్యడానికే అనుకున్న తన ఊహ తప్పయినందుకు.

వెళ్తూన్న మౌళి మరొక్కసారి చెప్పాడు "వ్యవసాయంతో కాలక్షేపం అయితే సరే, లేకపోతే మరేం మొహమాటం వద్దు. నా దగ్గరకొచ్చెయ్యండి, షాపు ఓపెన్ చెయ్యొచ్చు" అని.

"అదేమిటండీ ఇంత మంచాయన్ని వదిలిపోయింది మీ చెల్లెలూ!" బుగ్గలు నొక్కుకుంటూ ప్రశ్నించింది తర్వాత భర్తని లక్ష్మి.

"దానిఖర్మ!" అన్నాడు మోహన్రావు.

ప్రశ్న.

"నాన్నగారు బ్రతికి ఉన్నన్నాళ్ళూ గాలించారు దానికోసం, లాభంలేక పోయింది. చచ్చిపోయిందేమో!"

"మరి ఇతనెందుకింకా ఇలా ఉండి పోయాడూ?"

"నాకేంతెల్సే" విసుక్కున్నాడు మోహన్రావు.

పెళ్ళయి భార్య ఉన్నప్పుడెప్పుడూ అత్తవారింట కాలు పెట్టని మౌళి, వాళ్ళింటో ఇప్పుడు వారం రోజులున్నాడంటే ఆశ్చర్యపోయారు, మతిగాని చలించలేదుకదా అని భయపడ్డారు కూడా మూర్తీ శాంతా.

"ఉత్తరమన్నా వ్రాయకుండా వచ్చిన శాంతని చూస్తూచిన్నగా నవ్వి" అనుకోకుండా వచ్చేశావే. నన్ను చూడాలనిపించిందా" అడిగాడు మౌళి.

చాలా కాలం తర్వాత అతని వదనంలో మళ్ళీ అలాటిచిరునవ్వు తాను చూసింది. 'నన్నుచూడాలనిపించిందా!' ఎంత తియ్యగా వినిపించిందామాట తన చెవులకి! "ప్రతిక్షణం చూడాలని అనిపిస్తూనే ఉంది. కాని ఇలాకాదు, నిన్ను జంటగా ఇంకా అందమైన పిల్లల్ని ఎత్తుకొని ఉండేనిన్ను చూడాలని."

"ఓహో అయితే పెద్దప్లాను మీదే వచ్చావన్న మాట" మళ్ళీనవ్వాడు.

ప్లాను వెయ్యడానికేముంది. అది






సక్రమంగా జరగొద్దూ! సర్లే. ఏమిటీమధ్య అత్తవారింటి కెళ్ళావట?" అడిగింది.

మోహన్రావు వచ్చింది మొదలు జరిగినదంతా చెప్పి "నేను చేసినది తప్పంటావా?" అడిగాడు మౌళి.

"కాదు.మంచిపనిచేశావ్. ప్చ్. పాపం జయంతి తలితండ్రులు పోయారన్న మాట...నేనెంత పాపిష్టిదాన్నయి పోయాను!" తన్నుతాను నిందించుకుందిశాంత.

వారంరోజుల తర్వాతమళ్ళి పెళ్ళి ప్రసక్తి తెచ్చింది శాంత.

"నిన్నడిగి నీఇష్ట ప్రకారంచెయ్యాలంటే మరి జరగదు. మూడేళ్ళయింది. నిన్నిలా బ్రతిమిలాడి చెప్తున్నాను, ఊహూ, నామాట వినడంలేదు. నిన్నిలా చూడ్డంనాకేదో బాధగాఉంది. సంతోషంగా, నిండుగా బ్రతకాల్సిన రోజుల్లో సన్యాసిలా తిరగడం. మరినేను వప్పను. మంజులను తీసుకువచ్చి—"

"ఇలాఉంటే ఇప్పుడు వచ్చిన నష్టమేమిటి వదినా!" ఆమె మాటకు అడ్డు వస్తూ అన్నాడు మౌళి.

"లాభ నష్టాల సంగతి వదిలెయ్. పెళ్ళిచేసుకుతీరాలి. మంజులనే. నువ్వు ఓనాడు కోరుకున్న మంజులనే చేస్తాను"

"ఓ, అంతా నీ ఇష్టమే..." నన్నాడు.

"అవున్లే, అదినీలానే. నీకన్నా పెట్టింపుగా వాదిస్తూంది. నిన్నుచేసుకోదుట, ఎవ్వర్నీ చేసుకోదట"

"మరేం?...నీకెందుకీ బాధ"

కాక నాకు మిగిలిందేమిటి ? జయంతి ఏమయిందో ? ఆమె జీవితమెలానూ చక్కబరచలేను. నువ్వూ మంజులా మీ రెందుకు హాయిగా బ్రతకూడదు? నన్నెందుకు వేధించుకు తింటున్నారు. మొదట అలాచేశానని నామీద కక్ష పగ, ...నన్ను ఇలానే బాధించాలని నా కిదే శిక్షని దానికదీ నీకు నువ్వూ నిశ్చయించు కున్నారు. ఏ రోజు నిన్ను డాక్టర్ని చెయ్యాలనుకున్నామో, అత్యాశకు పోయామో, ఆనాడే మా మనశ్శాంతి పోయింది."

"ఎస్. కరెక్టు బాగాచెప్పావు" నవ్వాడు మౌళి. క్షణం తర్వాత అన్నాడు మళ్ళీ "పొరబడుతున్నావ్ వదినా ! మిమ్మల్ని బాధించాలని నిశ్చయించుకునే వాణ్ణయితే జయంతి మెడలో తాళికట్టేవాడినా! నిన్ను బాధపెడ్తున్నానంటావు. ఎందుకు బాధ పడాలి నువ్వు ? నాబాధ అర్థం చేసుకోవ డానికెప్పుడైనా ప్రయత్నించావా ?"

"ఏమిటయ్యా నీబాధ, కావాలని సంతోషంగా పొమ్మని. ఆభార్యకోసం నువ్విలా మారిపోయి, పెళ్ళంటేనే విము ఖత చూపిస్తున్నావంటే ఎవరన్నా నమ్ము తారా ?"

"నిజమే. నమ్మరు కాని జయంతీ నేనూ పోట్లాడుకునీ మనస్సులు విరిగి విడిపోయినవాళ్ళం కామే! నిజానికి ఆమె లేదు. స్నేహితులుగా బ్రతికాం ఓదగ్గర. నన్నర్థంచేసుకున్న జయంతి నా మనస్సు తెలుసుకున్న జయంతి, విడిపోవడం కోరింది. ఆమెను ఏ రకంగానూ తృప్తి పరచలేని నేను సమ్మతించాను. సరే బాగుంది. చాలామంది విడిపోయిన వారు న్నారు. తనను మళ్ళీ పెళ్ళిచేసుకోమని చెప్పాను. పోనీ ఉద్యోగం చెయ్యొచ్చు అదీ కాదంటే వారు తిండికి లేనివారు కారు.తల్లితండ్రులదగ్గర ఉండిపోరాదూ! ఎందుకు వెళ్ళిపోయినట్టు? ఏమైనట్టు?... అదే నాకు చాలాబాధగా ఉంది వదినా!"

"ఆత్మహత్య చేసుకుందేమో ! అయినా వివాహబంధం కాపోతే, నీకా అర్థంలేని బాధేమిటి !"

"అహ. అలా అయితే విడిపోవడం ఎందుకు కోరుతుంది ?"

"అయితే. నాకు తెలియక అడుగు తానూ ! ఇలా ఆలోచిస్తూ జీవితమంతా గడిపేస్తావా ?"

అతను మాట్లాడలేదు.

కొన్నిక్షణాలు గడిచిన తర్వాత మళ్ళీ అంది శాంత, "నలుగురూ ఏమను కుంటున్నారో తెల్సా నీ డబ్బుకాసించి మేము పెళ్ళి చెయ్యడంలేదని ఇంకా... నేను చెప్పలేను మౌళీ ఇంకా."

(సశేషం)




"ఏమిటో అంత దీర్ఘంగా చదివేస్తున్నావు ...." అప్పుడే క్రికెట్ ఆట ముగించుకొని, హాస్టలు గదిలో అడుగు పెడుతూ విజయకుమార్ ప్రశ్నించాడు.

"ఏంలేదు..., వరంగల్ నుంచి ఉత్తరంవచ్చింది. ఏం తోచక తిరగేస్తున్నాను. ఉత్తరం లోంచి తలయెత్తి. దరహాసంతో జవాబిచ్చాడు రవి

"వరంగల్ నుంచా, ఎవరు వ్రాశారేమిటి?"

"అక్క వ్రాసిందిరా! 'ఎన్నిసార్లు చెప్పినా వరంగల్ రావేమిటీ...' అని పాపం అక్కకు కోపం...మనకేమో టైము దొరకదాయె... ఏం చేద్దాం"

"వెర్రివాడివిరా! అంత ఆప్యాయతతో పిలిచే అక్కను చూడానికి టైము

నీకు? ఊఁ చెప్పు. ఎప్పుడు బయల్దేరడం?

"బాగుందిరోయ్! అక్కయితే సంక్రాంతి సెలవుల దాకా పైమిచ్చింది నీవేమో ఇప్పుడే రెక్కలు కట్టుకుని వాలమంటున్నావు...నీలాంటి వాడుండాలిరా వకాల్తాకి!"

"అమ్మా...అక్క–ఇద్దరి ప్రేమ పంచుకొనే నువ్వు నిజంగా చాలా అదృష్టవంతుడివిరా!" అతని కంఠంలో ఆవేదన ధ్వనించింది.

"అదేమిట్రా?! నీకో? అక్క–చెల్లీ ఎవరూ లేరా?..." ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రవి.

"ఉహుఁ...మా నాన్నకి నేనొక్కణ్ణే కొడుకుని...అమ్మలేదు ... ఇంకెవరూ లేరు..." బట్టలు మార్చుకోటం పూర్తి అయి బరువుగా కూర్చుంటూ అన్నాడు విజ్జి.

"అయితే మరి మీ నాన్నగారు..."

"ఉన్నారు...ఊహ తెలియని చిన్నతనం లోనే మా అమ్మ పోయింది. నాన్నే నన్ను పెంచాడు...మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు...నా భవితవ్యం కోసం... అతని కంఠం స్పందించింది.

రవి మనస్సు ఆర్ద్రమైపోయింది. తను చిన్నప్పటి నుంచి అక్క, అమ్మల అనురాగంలోనూ, నాన్న ఆప్యాయత లోనూ పెరిగాడు, ఏలోటూ లేకుండా గారాబంగా!పాపం విజ్జికి ఇవి ఏవీ లేవన్న ఇప్పుడు అర్థమవసాగింది. దీర్ఘాలోచనలో మునిగిన విజ్జి వైపు సానుభూతితో చూస్తూ అన్నాడు, "సరే విజ్జీ! ఈసారి సంక్రాంతి సెలవులకి అక్కావాళ్ళ ఊరు వెళ్దాం... నువ్వుకూడా రావాలి..."

"నేనా?! మధ్య నేనెందుకురా... చూదాంలే..." అన్నాడు విజ్జి పరధ్యానంగా "ఇంతకూ ఉత్తరంలో విశేషాలేమీ చెప్పావు కావు?... అభ్యంతరం లేకపోతే..."

"అభ్యంతర మేమిట్రా నీ మొహం ...ఇదిగో చదువు." అంటూ జాబు చేతి కందించాడు రవి

"చిరంజీవి చిన్నారి తమ్ముడికి, ఆశీస్సులు.

ఏరా రవీ! అక్కను మరచిపోయావా ఏం? బొత్తిగా ఉత్తరాలే మానేశావు. నువ్విలా చెయ్యడం నాకేమీ బాగాలేదు. మీ బావగారు కూడా ముద్దుల మరిదిని చూడాలని ఒకటే గోల. అంత తీరిక లేకుండా ఉన్నావా నాయనా!

వచ్చే సంక్రాంతికి నువ్వు ఇక్కడికి రావాల్సిందే. అమ్మకు కూడా ఉత్తరం వ్రాసేశాను, తమ్ముడు ఇంటికి రాడనీ, సెలవు అంతా మా దగ్గరే ఉంటాడనీ.

వస్తావు కదూ! నీకోసం ఎదురు చూస్తుంటాను మరి.

నిన్ననే నాన్న దగ్గర్నించి ఉత్తరం వచ్చింది; ఇంటి దగ్గర అమ్మా, నాన్న

న్నారు

జామ కాయలూ, సీతా ఫలాలు తగ్గించావా లేదా? అంత పిచ్చి ఇష్టం ఏవిట్రా నీకు? ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవద్దూ? అమ్మకూడా ఈసంగతే వ్రాసింది.

మర్చి పోయాను. మీ హాస్టలు తెరిచారా ఇంకా హోటల్ భోజనమేనా? నీ రూమ్ మేట్ ని గూర్చి చాలా వ్రాశావు. మనిషికి మంచి స్నేహితుడుండాలి, అండగా. మనసుకు తగిన మమత ఉండాలి నిండుగా. సంతోషం

ఇంకెన్నో సంగతులున్నాయి. వ్రాయటం ఎందుకూ? నువ్వే వస్తున్నావుగదా!

మనసారా దీవిస్తూ,

నీ అక్క,

మంజీర"

ఆ లేఖ లోని అనురాగం, ఆప్యాయత, చనువు, విజ్జి మనసులో వెన్నెలలు నింపాయి చదివి నంత సేపూ ఏదో తెలియని ఆనందానుభూతిలో ఓలలాడి పోయాడు

"మీ ఊరు తప్పకుండా వస్తాను రవీ!... అక్కను చూడాలనిఉంది..." హఠాత్తుగా అన్నాడు విజయ.

రవి ముఖం ఒక్కసారి వికసించింది. "పోదామా! వెరీగుడ్!... నువ్వెంత మంచి వాడవురా విజ్జీ. అయితే ఈసారి ఇవ్వాళెంతరా తారీకు? ..." ఇద్దరి దృష్టులు కేలెండరు వైపు పరుగెత్తాయి.

* * *

రవి, విజ్జి కొత్త స్నేహితులు. ఇద్దరూ ఈ ఏడే హైదరాబాదులో బి యస్.సి లో చేరారు. మొదటి సారి హోటల్లో కలుసుకున్నారు ఓ మూల భోంచేస్తున్న రవినిచూసి విజ్జికి ఎందుకో సానుభూతి కలిగింది, ఎవరో పాపం, తనలాగా హోటల్ భోజనం అలవాటు లేదల్లే ఉంది, అనుకున్నాడు. ఆ తరువాత అప్పుడప్పుడూ అదే భోజనశాలలో కలిసే వాళ్ళు విజ్జికి అతణ్ణి మాట్లాడించాలని ఉండేది కాని ఎలా పరిచయం చేసుకుని మాట్లాడటం?

ఆరోజు ఆట మైదానంలో విజ్జికి పార్కర్ పెన్ దొరికింది 'అయ్యో! ఎవరు పోగొట్టు కున్నారో పాపం, అనుకుంటూ వెంటనే తీసుకుపోయి గేమ్స్ డిపార్టు మెంటులో అప్పగించాడు.

మర్నాడు క్లాసు కాగానే, పెన్ పోగొట్టు కున్న విద్యార్థి అమాంతం విజ్జి దగ్గరికి వచ్చి "చాలా థాంక్సండీ! మా అక్క ఆప్యాయంగా నా పుట్టిన రోజు నాడు ఇచ్చిన పెన్ను ఇది... ఇంతకూ ...గేమ్స్ మాస్టారు చెప్పారు, ...మీ పేరే కదూ విజయకుమార్?" అంటూ చెయ్యి కలిపేశాడు, హాయిగా నవ్వుతూ.

"మీరా!..." ఆశ్చర్యంగా చూస్తూ

విజ్జి; మళ్ళీ తేరుకొని అన్నాడు. "ఫరవా లేదండీ. అంత విలువైన పెన్ను మళ్ళీ మీకు దొరకటం చాలా సంతోషంగా ఉంది... మిమ్మల్ని హోటల్లో చూస్తుంటాను. మీపేరు..."

నా పేరు రవి ...వి. బి. రవి ... పూర్తిగా చెప్పాలంటే వేదం భారవి.

"బలేచమత్కారమే...భారవి పేరు. అంతగా భారం కాదు గాని, రవి మాత్రం రమ్యమైన పేరండి..." నవ్వుతూ అన్నాడు విజ్జి... "ఇంతకూ మీకు నా పెన్ను దొరికింది; నాకు మీ స్నేహం దొరికింది."

"పెన్ను లాగా ఈ స్నేహం మాత్రం పోగొట్టుకోనులెండి."

ఈ సంభాషణే వాళ్ళిద్దరినీ విడిపోని సన్నిహితులుగా కలిపింది. ఒకరొకరిని 'మీరు',– 'అండి'... అంటూ లాంఛన ప్రయోగాలతో మాట్లాడుకోటం కూడ అదే తొలిసారి, తుదిసారి కూడా అయింది.

* * *

ఆ రోజున సెలవేమో, విజయ్ కిటికీ దగ్గర కూర్చొని, ఏదో చిత్రానికి రంగులు వేస్తున్నాడు బయటి నుంచి అప్పుడే వచ్చిన రవి చూపు ఆకస్మికంగా ఆ చిత్రంపై ప్రసరించింది. ఆశ్చర్యపడుతూ అన్నాడు. "అరె ! ఎంత బావుంది వేశావా ?"

తలయెత్తి నవ్వుతూ అన్నాడు విజ్జి. "అవును రవీ ! బాలల దినోత్సవ సందర్భంగా మన కాలేజీపోటీల కని తయారు చేస్తున్నాను. ఎలావుంది ?..."

'అద్భుతంగా వుంది. నువ్వింత మంచి చిత్రకారుడవని నాకు ఇప్పటిదాకా తెలియదు. విద్యే ఒక్కటే నీ హాబీ అనుకున్నాను ! ఈ మూడు నెలల్నించీ ఎప్పుడూ నువ్వు చిత్రంగీయగా చూడలేదు..."

"చిత్రకళ నాకెంతో ఇష్టంరా రవీ ! నా రచనలు చాలా చిత్రాలున్నాయి. చూస్తావా ? నాకు కూడా తృప్తిగా ఉంటుంది నువ్వు చూస్తే..."

"ఓయ్యేస్ ! ఏవీ తీసుకురా ! ఈ పుస్తకాలతో బోర్ కొడుతుంది. ఒక మంచి ఛేంజ్..." కుతూహలంతో అన్నాడు రవి.

చిత్రాల ఆల్బమ్‌కు చెరోవేపు కూర్చున్నారు. అందాకా గంభీరంగాఉన్న వాతావరణం ఇప్పుడు ప్రఫుల్లితమైంది.

"అబ్బ ! ఎంత నైపుణ్యం ..." ఒక్కొక్క చిత్రం చూస్తూ రవి ఆశ్చర్య చకితుడైపోతున్నాడు

'ప్రకృతి కన్య'– "ఓహో !" ఇన్ని సోయగాలతో ఇంత అందంగా ఉంటుందా ప్రకృతి. అనుకున్నాడు రవి.

'బడలిక,' 'బాధ్యత'. 'మాతృ




మూర్తి,' 'నిరీక్షణ,' 'పుష్పవిలాసం'— అందాలు చిందుతూ, కన్నుల విందుగా, మూగ భావాలు ఒలకబోస్తూ ఒక్కొక్క చిత్రం అతనిలో వినూత్న ఉత్తేజం వెలార్చింది.

"ఇంత గొప్ప చిత్రకారుడు నా స్నేహితుడు కావడం అంటే–నాకెంతో గర్వంగా ఉందిరా!" మిత్రుని యెడ అభిమానం నిండిన స్వరంతో అన్నాడు రవి, చూడడం ముగిస్తూ.

"సరేలే! నీ మాటల్లో నా గొప్పకంటే నీ అభిమానమే వినిపిస్తోంది రవీ! కాని నాకు క్రొత్త బలం వస్తోంది. ఇంతకూ ఇవన్నీ నీకు నచ్చిన చిత్రాలు కదూ?...మరి నాకు నచ్చిన చిత్రం చూస్తావా?...అది నా అభిమాన చిత్రం తెలుసా?..."

పట్టరాని ఉత్సాహంతో రవి అన్నాడు, "అలాగా! ఏదీ? అది ఈ ఆల్బంలో ఎందుకు చేర్చ లేదింకా?..."

విజయ్ తన సూట్‌కేసు తెరచి, ఒక కవర్లోంచి తీస్తూ ఆ చిత్రం తీసుకు వచ్చాడు.

చిత్రం చూస్తూనే స్థబ్ధుడైపోయాడు రవి. "ఇదా? నువ్వెలా గీశావు? చిత్రాన్ని తేరిపార చూస్తూ, కొంచెం

"ఈమె...ఎవరీమె?......?"

"ఏమని చెప్పను ? మామూలుగా చెప్పాలంటే ఈమె ఎవరో నాకు తెలియదు. కాని జన్మ జన్మాల చిర పరిచిత సంబంధం ఉన్నట్లనిపిస్తుంది. నా హృదయం కూడా ఇదే ప్రశ్నిస్తూ ఉంటుంది ...ఎవరీమె ?...ఏమో...నా ఆరాధ్య దేవత అనుకుంటాను..."

రవి కేమీ అర్థం కాలేదు. ఆ చిత్రం పైన ఉన్న 'మమత' అనే అక్షరాలు చదువుతున్నై అతని పెదవులు, నిశ్శబ్దంగా.

విజి చెప్పకుంటూ పోతున్నాడు, "ఎందుకు చిత్రించానో తెలియకుండానే, ఎవరో తెలియకుండానే, చిత్రిస్తూ పోయాను. నెలల కొద్దీ మెరుగులు దిద్దాను. ఇంకా దిద్దుతూనే ఉన్నాను. ఎదలో నింపిన మమతల్ని, చిరకాలం నేను కోరిన మమతల్ని అన్నింటినీ కలబోసి రూపుదిద్దాలని నే చేసినయత్నం ఇది. అప్పుడప్పుడు నా కనిపిస్తుంది— అక్క, అమ్మల అనురాగం ఎరుగని నా హృదయంలో శూన్యాన్ని ఈ రూపంలో నింపుకుంటున్నానా అని. మా అమ్మ ఎలా ఉండేదో... నాకు గుర్తు లేదు...'ఏదోలోకంలో ఉన్నట్లు చెప్పకు పోతున్నాడు. హఠాత్తుగా ఆగిపోయాడు.

మధ్యలోనే ప్రశ్నించాడు రవి, "ఒక వేళ ఈమె నీకీ లోకంలో కనిపిస్తే..."

విజ్జ ముఖంలో ఉత్తేజం తాండవించింది. "అవును రవీ!...తప్పకుండా ఎవరో వ్యక్తి—ఇలాంటి వ్యక్తి ఈ లోకంలో ఉండాలి. ఉండి తీరాలి నువ్వు నమ్ముతావు కదూ ?"

"ఈమె నీకు కనిపిస్తే ఏం చేస్తావు?..."

"ఇన్ని ఏండ్ల నిరీక్షణ,నా అన్వేషణ సఫలం చేసిన ఈ స్త్రీ మూర్తికి మనసా నమస్కరిస్తాను. ఆమె ఒడిలో పడుకొని తృప్తిగా కన్నులు మూస్తాను... నా హృదయంలో అంతులేక కొనసాగే శూన్యానికి ఆ ఘడియ ఎప్పుడా అని ఆవేదన పడుతున్నాను, రవీ!... ఏదో చెప్పకు పోతున్నాను...పిచ్చి వాడను కుంటున్నావా ?..."

'నేనలా అనుకోను...సరేకాని, ఒక వేళ ఈమె నీకు తటస్థ పడితే, నీవు ఊహించినంత అమృత మూర్తి కాకపోతే..."

"నా ఊహల మీద నాకు నమ్మకం ఉంది రవీ!" దృఢంగా ఉందతని స్వరం.

"ఒకవేళ ఇలాంటి స్త్రీని నీకు నేను చూపిస్తాననుకో... నా కేమిస్తావ్ ?"

"నిజంగానా ? ఇలాంటి వ్యక్తిని నీ వెక్కడైనా చూశావా ? లేక వేళాకోళం చేస్తున్నావా రవీ!" విస్ఫారిత నేత్రాలతో, ఆత్రంగా అన్నాడు విజయ్.

"లేదు విజయ్... త్వరలోనే నీకీమె

కనిపిస్తుందని నాకందుకే అనిపిస్తు న్నది."

ఆ రోజంతా కులాసాగా గడచిపోయింది. నవనీతం కన్నా కోమలమై, మమతా పూర్ణమై కూడా మమత కోసం ఆవేదన పడే విజ్జి ప్రవృత్తికి రవి ఆశ్చర్య పడసాగాడు. ఏ స్త్రీ అనురాగం ఎరుగని ఈతని మనుతా శూన్య హృదయం ఎంతో కఠోరంగా మారిపోవలసింది! పెడ దారులు పట్టలేదు. కవిగా, చిత్రకారుడుగా, భావుకుడు కావడమే, అందుకుకారణమై ఉండాలి. ఈ దారుల్లో అతని హృదయం మగ్నమై ఆరగ్నమై ఉండకపోతే... ఏదో ఆలోచిస్తూ, టేబుల్ లైట్ ముందు కూర్చొని లెటర్ ప్యాడ్ తెరిచాడు రవి. సంక్రాంతి సెలవుల్లో స్నేహితునితో సహా వరంగల్ వస్తున్నట్లు ఉత్తరం వ్రాసేశాడు.

* * *

తెలుగు నాట, ఇంటింటా వింత కాంతి వెలయిస్తూ, సంక్రాంతి సమీపిస్తోంది. ఉత్సాహంతో ఉరుకులు తీసే రైలు పెట్టెలో కాలమంతా సల్లాపంలో గడిచిపోయింది, స్నేహితు లిద్దరికీ. 'అక్కను చూసి చాలా కాలమైంది. ఇంకా వరంగల్ రాదేమా' అనిపిస్తోంది రవికి. కమ్మని కబుర్లలో, ప్రకృతి దర్శనంలో వరంగల్ స్టేషన్ ఇట్టే వచ్చేసింది. ఇద్దరూ రిక్షాలో కూర్చు న్నారు.

చాలల విజ్జ అన్నాడు, నేను నెల్లూరి వాడను. వరంగల్ మొదటిసారి వస్తున్నాను. నెల్లూరికీ, వరంగల్‌కూ చుట్టరికం కలిపిన మహానుభావుడు, తిక్కన సోమయాజి గుర్తుకువస్తున్నాడు రవీ!..."

"అవును విజ్జీ! తెలుగు వాళ్ళ చరిత్రలో అదొక మధుర ఘట్టం. ఒక అద్భుత సన్నివేశం..."

కొంత సేపు మౌనంగా పయనించారు. ఇల్లు దగ్గరకు వస్తోంది. రవి ప్రస్తావించాడు, "అనుకోకుండా ఒక అద్భుత సన్నివేశం ఎదురైతే, ఆ అనుభూతి ఎలా వుంటుంది విజ్జీ..."

"భాషాశక్తికి అతీతంగా ఉంటుం దనుకుంటాను. అయినా నాకిలాంటి అనుభూతి ఎదురుపడలేదెప్పుడూ!..."

సంధ్యా సమయం. చిరు చలిగా పిల్ల గాలి వీస్తోంది. విశాలమైన వరంగల్ రాజమార్గం మీద రిక్షా పరుగెత్తు తోంది. కాకతీయ కళా ప్రాభవనిలయంగా, ప్రాచీనాంధ్ర నగరంగా, ఆ వినూత్న వాతావరణంలో విజయ్ మనస్సులో ఉత్సాహం ఉరకలు పెడుతోంది. ఆనందం వెల్లివిరుస్తోంది.

మరో పదినిమిషాల తరువాత ఒక ఇంటిముందు నిల్చొని ఉన్నారు, ఇద్దరూ. తలుపుతట్టి "అక్కా" అని పిల్చాడు రవి.

ఒక నిమిషంలో జవాబు వచ్చింది,

ల్లాంటి చిరునవ్వుతో, అచ్చుపోసిన అప్యాయత లాంటి రూపంతో, తలుపు తీసింది అక్క. విజ్జి ఉన్నచోటే దిగ్భ్రాంతుడై నిల్చుండిపోయాడు. ఆ మూర్తిని తిలకిస్తూ.

"ఈమె ?...తన ఊహా చిత్రం! ...కలా, నిజమా? తను చిత్రించుకున్న "మమత." ఎదురుగా సజీవంగా నిలబడి చిరునవ్వుతో ఆహ్వానిస్తుంటే కల ఎట్లా అవుతుంది ?..."

"అలా నిలబడి పోయావేం విజ్జీ! పద లోపలికి. ఈమె మా అక్క..." విజయ్‌ని హెచ్చరిస్తూ, చిన్నగా నవ్వుకుని మంజీర వైపు చూశాడు రవి.

"మీ స్నేహితుడికి మొహమాటం ఎక్కువల్లే ఉందే, లోపలికి రాబాబూ! ...నీ పేరు విజయ్ కదూ?... నువ్వు కూడా తమ్ముడివే." ఆమె కంఠంనుంచి వెలువడుతున్న ప్రతి పలుకూ తేనె సోనలా వుంది విజయ్‌కి. ఏదో స్వప్నలోకం లోలా మౌనంగా లోపలికి నడిచాడతను.

మంజీర భర్త ఆనంద్ చాలా ఆదరంతో, అభిమానంతో పల్కరించాడు విజ్జిని కూడా...ఎంతో పరిచితుడు లాగే. ఆ యిద్దరి ఆప్యాయతలో కరిగి పోయాడు విజయ్.

"మీ యిద్దరి ఆదరానికీ చాలా కృతజ్ఞతలండీ..." అన్నాడు, మాటలు వెతుక్కుంటూ విజయ్. ఆమె నవ్వింది, నట్లు అనిపించింది విజయ్‌కి. "అండి, గిండీ ఏమిటి బాబూ! చెప్పాను గదా! నాకు, నువ్వూ రవీ ఒకటే. నీకూ నేను అక్కనే..."

"కాదమ్మా!...అమ్మవు..." అనుకున్నాడు పెదవులతో విజ్జి.

"ఇంతకీ తమ్ముడూ! నువ్వేసిన చిత్రమేది? నాకు చూపించవూ?" అంది మంజీర, పొంగి వచ్చే అనురాగంతో.

తను సృష్టించిన ఆ మూగ మమత చిత్రం చేతిలో పట్టుకొని, సజీవంగా కూర్చున్న మమతా మూర్తిని చూస్తూ, తన నిరంతర అన్వేషణ ముగిసిన సంతృప్తితో, ఉద్విగ్నుడైనాడు విజయ్.

చిత్రం చూడడంలో మునిగిపోయింది మంజీర. విజ్జి మనస్సు ఎక్కడో తిరుగాడు తోంది. "నన్ను అంత చిన్న పాపగా ఎందుకు వదలిపెట్టి పోయావమ్మా!...మళ్ళీ ఇన్నాళ్ళకా నీదర్శనం ...నేనేం చేశానని?"... అంటున్నదతని మనస్సు. మాటల రూపంలో ఆ భావం బహిర్గతం కాలేదు... కానట్లు అతనికి తెలియదు.

"ఏమిటి బాబూ! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అతని మొహంలోకి చూస్తూ ఉలిక్కిపడింది మంజీర. "అరె! ఎందుకు కన్నీరు పెడ్తున్నావు?"

"కన్నీరు కాదక్కా! పన్నీరే! అనుకోని అదృష్టం రవి రూపంలో నన్ను




వెతుక్కుంటూ వచ్చి, సంవత్సరాల నా అన్వేషణ ఫలింపచేసి, చల్లని నీ సన్నిధి లోకి చేర్చింది..."

మంజీర హృదయం అనురాగంతో పొంగింది. "బాబూ! ఈ జన్మలో మనది రక్తసంబంధం కాక పోవచ్చు, కానీ ఆప్యాయతలు జన్మ సిద్ధమే కావుకదా!" విజయ్‌ని దగ్గరికి తీసుకొని తల నిము రుతూ అంది. రెండు వెచ్చని బాష్ప బిందువు లామె పాదాలపై పడ్డాయి. ఆమె ఆశీర్వదిస్తూ అంది, "పది కాలాలు పచ్చ పచ్చగా వర్ధిల్లాలి విజ్జీ!"

బాగా ప్రొద్దెక్కింది, "అమ్మ బడి చదువుల బడి, మా అమ్మ ఒడి నాకొక గుడి." కూనిరాగం తీస్తూ, స్నానం ముగించుకొని వస్తున్నాడు విజయ్.

"ఏరా విజయ్... మా అక్కను చూసి నన్ను మర్చి పోయినావు కదూ!..." అంటూ వంటింట్లోకి దారి తీశాడురవి.

"నిన్నెలా మర్చిపోతాన్రా. నీవే లేక పోతే అంతా చీకటే రవివికదూ!"

"మంజూ! ఇక వడించెయ్. నీ తమ్ముళ్ళిద్దరూ వచ్చేశారు .." అన్నాడు ఆనంద్ అప్పుడే ఇంట్లో అడుగుపెడ్తూ. అంతా భోజనాల దగ్గర కూర్చున్నారు. అక్క చేసిన మిఠాయిలు తింటూ రవి అన్నాడు. "విజ్జీ ఈ అనుభూతి ఎలా వుందిరా?..."

చెప్పినట్లు జ్ఞాపకం...ఈ అనుభూతీ....
ఈ అనుభూతి లాగే వుంది..."

పండుగ మూడు రోజులూ మూడు క్షణాల్లా గడచిపోయినై. సెలవుల అనంతరం బాధాకరమైన వీడ్కోలుదినం వచ్చింది. అనుబంధాలెంత విచిత్రమైనవి? అనుకున్నారు అందరు.

* * *

అది మార్చినెల. పట్టణంలో కలరా వ్యాపించడం వలన ఓ వారం రోజులు కాలేజీలు మూసేశారు. విజయ్ తండ్రిని చూడాలని ఇంటికి వెళ్ళాడు రవి కూడా తన ఊరు బయలుదేరి వెళ్ళాడు. ఎలాగో వారం రోజులు గడచిపోయినై.

రవి అప్పుడే బండి దిగి టైమవుతుందని సరాసరి కాలేజీకే వెళ్ళాడు. క్లాసులో చూస్తే విజయ్ లేడు. ఇంకా ఊరి నుండి రాలేదేమో అనుకుంటూ రీడింగ్ రూమ్‌కి నడిచాడు రవి. అక్కడ బల్లమీద తన పేరున రెండు ఉత్తరాలు ఎదురుచూస్తూ కనపడినై. ఒక ఉత్తరం మీద నెల్లూరు ముద్రఉంది

"ఓహో! విజయ్ దగ్గర్నుంచా" అనుకుంటూ కవరు ఆత్రంగా తెరిచాడు రవి. అది చదువుతూనే కుప్ప కూలిపోయాడు. 'కలరా వచ్చి విజయ్ చనిపోయాడ'ని అతని తండ్రి వ్రాసిన ఉత్తరమది. క్షణంసేపు స్తంభించిపోయి దుఃఖ మాపుకోలేక బయటికి వచ్చేశాడు రవి. అతని పాదాలు హాస్టలు గదివైపు చింపి చూశాడు. వరంగల్ నుంచి బావ వ్రాసిన లేఖ : అక్క ప్రసవించిందనీ, బాబు పుట్టాడనీ వ్రాసివుంది.

హాస్టల్ గది తాళం తెరవాలంటే బాధ, భయం ఆవరించాయి. గదంతా ఏదో వేదనతో శూన్యంగా కనిపిస్తోంది. హఠాత్తుగా అతని దృష్టి క్రింద పడిఉన్న మరో ఉత్తరం మీద పడింది. "అరె! విజయ్ వ్రాత... విజయ్ బ్రతికే ఉన్నాడా?" ఉత్తరం చేతిలోకి తీసుకున్నాడు. నాలుగు రోజుల క్రింద వ్రాసిన లేఖ అది.

బావ ప్రక్కన కూర్చొని రవి, విజయ్ భోజనం చేస్తుంటే, అన్నం వడిస్తున్న 'మమత' చిత్రం—దానితో పాటు ఒక లేఖ ఉన్నై కవర్లో.

సజల నేత్రాలతో సూట్‌కేస్ సర్దుకుని గదికి తాళం సివే, గబగబా స్టేషన్ వైపు బయల్దేరాడు రవి. రైలు వరంగల్ వైపు ఉరకలు పెడ్తోంది. మళ్ళీ ఉత్తరాలు తీసి చూశాడు. అతని హృదయంలో అద్భుతం ఆవరించింది. ఆ రెండు సంఘటనలు ఒక రోజే జరిగాయి! "విజయ్ చనిపోలేదు; మళ్ళీ పుట్టాడు. అతని అన్వేషణ ముగిసింది." కాగితాలు మడత పెట్టేస్తూంటే, అప్రయత్నంగా అతని నోటి నుండి ఈ మాటలు వెలువడినై. కంటి నుండి రెండు జల బిందువులు రాలినై.

—————




కొడవటిగంటి కుటుంబరావు

శ్రీనివాసరావు మాటనమ్మి స్కూలుకు సెలవుపెట్టి వెళ్ళాలా వద్దా అని నేను చాలా సేపు మథనపడ్డాను. అసలే మా స్కూలుపరిస్థితులు అమిత దుర్భరంగా ఉన్నై. మాష్టర్లమందరమూ ఒక్కసారిగా ఎనిమదిమంది కమిటీమెంబర్లను తృప్తిపరచవలసి వచ్చేటప్పటికి మా తలప్రాణం తోకకు వస్తున్నది. ఏ క్షణాన ఏ మెంబరు ఏ పార్టీలో ఉంటాడో, ఎవరిచ్చిన శలవు ఎవరు రద్దుచేస్తారో తెలియని స్థితిలో నేనుంటే మా శ్రీనివాసుడు, "నీకు పునర్జన్మలో నమ్మకం ఉందా? ఉన్నా లేకపోయినా నీకు ఒక చిత్రం చూపిస్తాను. ఈ రహస్యం ఇంకా ఎవరికీ బయట పెట్టలేదు. నువ్వూ నేనూ కలిసి కొంత రహస్యశోధన చెయ్యటానికి ఇది మంచి అవకాశం. కాబట్టి ఈ వుత్తరం అందిన వెంటనే గురు శుక్రవారాలు శలవుపెట్టి రా, సోమవారందాకా ఉండవచ్చు. ఒక్కసారి ఈ రహస్యం నీ కళ్ళతో నువు చూశావంటే నీకే నమ్మకం కలుగుతుంది" అంటూ రాస్తాడు. గురు శుక్రవారాలు మాత్రమే శలవు పెట్టానంటే శని ఆదివారాలు

ంండుం జూలూ కమిటి మెంబర్లు యావ న్మందీ, నాకోసం అర్జంటు పనిమీద మా యి ంటి చుట్టూ తిరిగిపోతారు! అది శ్రీనివాసు కేంతెలుసు? తీరాపోతే ఏమీ ఉండదేమో!

కాని బయలుదేరాను. నిరుత్సాహం తోనే నేను మాష్టరునయి సిగరెట్టు కాల్చటం మానుకొన్నప్పటినించీ,నిరర్థక మైనపనులు చెయ్యటమంటే, నాకొక విధ మైన భయం పట్టుకుంది. ఏదైనా పని ఉంటేనే ఎక్కడికయినా వెళ్ళటమూ, అదికూడా ఎంతో ఆలోచించి మరీ వెళ్ళ టమూ. నాకు ఉద్యోగంతో కలిగిన కొత్త అలవాటు.

తీరా రైలెక్కిన తరవాత తట్టింది శ్రీనివాసరావుకు కొంచెం మతిభ్రమ ఏమయినా ప్రారంభమయిందేమోనని. ఆ అనుమానం ఇంటిదగ్గిరే కలిగితే, అసలు బయలుదేరకనే పోదును. శ్రీనివాసరావుకు మతిభ్రమ కలిగిందను కోటానికి చాలా అవకాశం ఉంది—నాకు ఈమాత్రం ఇంటి దగ్గిరే తట్ట లేదు కాని, వాడు తండ్రి చచ్చిపోయిన అయిదు సంవత్సరాల కాలంలో జూదం లోనూ, గుర్రపు పందాల్లోనూ, స్నేహి తులమీదా, తాగుడుకూ, వేశ్యలకూ పాతిక వేలయినా తగలవేశాడు. వాణ్ణి చిన్నప్పటినించీ ఎరిగిన వాళ్ళంకూడా వాడిట్లా అవుతాడని అనుకోలేదు. వాడి పరివర్తనలన్నీ దురూహ్యాలుగానే ఉంటూ ఉండేవి. ఇంకా ఒక కొంపా నాలుగెక రాల భూమీ ఉందనగా శ్రీనివాసరావు మరొక పరివర్తనం కలిగి వెనకటి జీవి తమంతా ఒక్క క్షణంలో చినిగిన చొక్కా ను విసర్జించినట్టు విసర్జించి రైలుకు ఆమడదూరాన, ఆ బ్రాహ్మణ కోడూరు గ్రామంచేరి,వాడి స్వగృహంలో ఉంటూ సేద్యం ప్రారంభించాడు. అంతా సంతోషించాం అప్పట్లో. తీరా రైలె క్కిన క్షణాన నాకు సందేహం ప్రారంభ మయింది—ఈ పల్లెటూరి జీవనమూ, స్వయంకృషీ వాడి నెత్తి ఆడించిందేమో నని, ఒకటి చేతామనుకున్నాను. చెప్పిన ప్రకారం వాడు చుండూరు స్టేషను దగ్గిర నాకోసం హాజరు కాకపోతే నాతోవను నేను ఇంటికి తిరిగి వచ్చేద్దామనుకున్నాను. ఆబండికి నన్ను రమ్మనీ తను నాకోసం కనిపెట్టుకుని స్టేషనుదగ్గిర ఉంటాడనీ రాశాడు స్పష్టంగా.

వా డెందుకు రాకుండా ఉంటాడూ! ప్లాటుఫారంమీద వాణ్ణి కలుసుకుని వాడి వాలకం జాగ్రత్తగా గమనించాను. వాడి కళ్ళలో వెర్రిచూపు లేకపోలేదు. వాడి జుట్టుకూడా రేగి చిందరవందరగా ఉంది. అయినా తొందరపడకూడ దనుకున్నాను.

మాకోసం స్టేషను బయట గుర్రపు బండి సిద్ధంగానే ఉంది.

"నేను నీకోసం స్టేషనుకు రావటంలో ముఖ్యమైన ఉద్దేశం ఒకటి ఉంది. కాబట్టి నీ వెధవ పరధ్యానంమాని నే

శ్రీనివాసరావు, బండి సాగగానే. "ఒక మనిషి ఆరునెల్లకిందట చచ్చిపోయి మళ్ళా మూడు నెలలకిందట కుక్కఅయి పుట్టాడు!" అని శ్రీనివాసరావు ఆగాడు.

నా అనుమానం దృఢమయింది. నేననుకున్నంత అయింది కదా అనుకున్నాను. ఈ పిచ్చివాడితో నేను ఆరు మైళ్ళు ప్రయాణం చెయ్యాలి. వాణ్ణి బండివాడికీ, నాకూ మధ్య కూర్చో బెట్టటంకూడా మంచిదే ఐంది. ఈరకం పిచ్చి అంటే ప్రమాదకరమయినదని కాదు—ఏళ్ళ పర్యంతమూ బయటపడకుండా మనిషిని లోలోపల తొలిచే ఉన్మాదం ఇది. చూశారో లేదో, పిచ్చివాణ్ణి రెచ్చగొట్టటం అమిత అపాయకరం. అందుకని నేను వాడు చెప్పిన దానికల్లా ఊకొట్టసాగాను.

"భాగోతుల ఆదినారాయణశాస్త్రి ఉండే వాడు ఎరుగుదువు కాదూ!" అన్నాడు శ్రీనివాసరావు. ఆ భాగోతుల పెద్దమనిషి ఎవరో, నేను బుద్ధితక్కువగా స్కూలుకు శలవుపెట్టి బ్రాహ్మణకోడూరు అగ్రహారం వెళ్ళుతుండటానికీ, ఆ పెద్దమనిషికీ ఏమి సంబంధమో ఊహించలేకుండానే, "అవును, అతనిప్పుడు కోడూరులో ఉంటున్నాడా?" అన్నాను.

నే నామాట లనగానే శ్రీనివాసరావులో కలిగిన వికారం వర్ణనాతీతం. వాడి కళ్ళు మరింత ఉన్మాదంగా మెరిచేశాడు. వాడితలకు బండికప్పు తగిలింది. ఆ తరవాత వాడి ఉద్రేకం కొంచెం ఉపశమించింది కాని పూర్తిగా రహితం కాలేదు.

"చూశావా? ఇదే క్లేర్‌వాయన్సంటే!" అన్నాడు వాడు.

"ఏది?" అన్నాను బండిలోనించి బయటికి తొంగిచూసి.

"ఆదినారాయణ చచ్చిపోయి ఆరు నెల్లయింది. వాడిప్పుడు తిరిగి కుక్కగా పుట్టి మాయింటో ఉన్నాడు! వాణ్ణి చూపించటానికే నిన్ను తీసుకుపోతున్నాను!"

వాణ్ణి ఈ స్థితిలో మీరు ఊహించుకోవాలే కాని నేను వర్ణించలేను. వాడి రేగిన జుట్టూ, పాలిపోయిన కోల మొహమూ, హాస్యంతో కాక కేవలమూ ఉద్రేకంతో నవ్వుతూ వణుకుతున్న వాడి పెదిమలూ, అన్నిటినీ మించి వెర్రిచూపుతో నిండిన వాడికళ్ళూ—సముద్రానికి అవతలి మేరకని పెట్టిన కొలంబసు, ఇట్లాగే కనపడి ఉంటాడని ఊహించుకున్నాను. పరీక్ష పాసయిన విద్యార్థులూ, లాటరీలో డబ్బు సంపాదించిన దరిద్రులూ, ఎదయిన ఆవులూ మొదలైన వస్తువులలో ఉండదగిన లక్షణాలు వాడిలో కనిపించినై. వాడికి పిచ్చిపట్టిందనుకోవటం నాదే పొరపాటు—వాడి

నెక్కడా చూడలేదు.

"ఇది – ఈ కుక్క – ఆ ఆదినారాయణే నని నీ కెట్లా తెలుసు?" అన్నాను.

శ్రీనివాసరావు కొంచెం తికమక పడ్డాడు.

"అది నేను రుజువు చెయ్యలేను. కాని ఈ కుక్క ఆదినారాయణేనని నాకు తెలుసు." అన్నాడు వాడు చివరకు.

"నీ నమ్మకానికైనా కారణం చెప్పు. ఏదో కారణం ఉండాలిగా!"

"చెబితే నవ్వుతావేమో!" అన్నాడు శ్రీనివాసరావు, నిష్కారణంగా సిగ్గు పడుతూ.

"నీకు తెలిసిందంతా నాకు తెలియక పోతే నేను వచ్చినందుకు ప్రయోజనం ఏముందీ? ఏదో కుక్కను చూపించి 'ఇది ఆదినారాయణ అని నమ్ము' అంటే, 'ఓహో! ఇదా పునర్జన్మ అంటే' అని నే నెట్లా అనగలనూ?"

"ఒకసారి నేను ఈ ఆదినారాయణ శాస్త్రికి పన్నెండువందలు బదులిచ్చాను. వాడదబ్బు తీసుకుంటూ; 'నీ వాకిట్లో కుక్కఅయి పడిఉండి అయినా నీ రుణం తీర్చుకుంటాను, భాయి!' అన్నాడు. వాడా బాకీ తీర్చనేలేదు..."

నా కిదంతా చాలా చాదస్తంగా కన పడ్డది.

"ఈ కుక్కవల్ల పునర్జన్మ అనే దాన్ని గురించి శోధన చెయ్యాలంటే మైన మార్గం తొక్కాలేమో!" అన్నాను.

శ్రీనివాసరావు నొచ్చుకున్న వాడల్లే, "నే నందుకే చెప్పనన్నాను...... అసలు నీకు ఈ కుక్క ఆదినారాయణ అయినా ఆకాశరామన్న అయినా ఒకటే. దానికి మనిషికున్న జ్ఞానం ఉంది. దానికి మనం మాట్లాడేది స్పష్టంగా అర్థమవు తుంది. అది కిందటి జన్మలో మనిషి. అవి జ్ఞాపకం పెట్టుకుని మరీ ప్రవర్తించు. దాన్ని ఒకసారయినా చూడందే నీకు నే నెంత చెప్పినా నీ తల కెక్కదు. ఇదంతా ఇప్పుడెందుకు చెబుతున్నానంటే, నువ్వు మా యిల్లుచేరిన తరవాత ఆ కుక్క వింటుండగా దాన్ని గురించి "అదీ, ఇదీ" అనటంగాని, ఇంకేవిధంగా నన్నా అవమానించటంగాని చేస్తే దానికి అర్థమవుతుంది—వ్యవహారం మొదట్లోనే బెడుస్తుంది. అందుకని ఇదంతా చెబుతున్నాను. కావాలంటే జాగర్తగా నువుకూడా గమనించి, నే చెప్పినదంతా నిజం ఔనో కాదో తణిఖీ చెయ్యి!"

ఆ తరవాత బండి వాళ్ళ ఇంటిముందు ఆగేవ ాకు వాడు కుక్కను గురించి ఏమీమాట్లాడలేదు. బండికుదుపు జాస్తిగా ఉండటంవల్ల క్రమంగా సంభాషించాలనే ఇచ్ఛకూడా పోయింది నాకు.

"ఆదినారాయణ — అదే, ఈ కుక్కను గురించి నా భార్య ఎగ్గిరకూడా ఏమీ ప్రస్తావన తీసుకురాకు. ఆవిడకు




ఆ కుక్క అంటే చెప్పతరంకాని మంట!" అన్నాడు శ్రీనివాసరావు మేమిద్దరమూ ఇంట్లోకి పోతుండగా.

"ఏం? ఆవిడకు పునర్జన్మ విషయమై నమ్మకంలేదా?"

"అదికాదు. ఆవిడకింకా ఆవిషయం తెలియదు. తెలిస్తే దాన్ని చంపేస్తుంది కూడానూ! అది తనవంక మనిషి చూసినట్టు చూస్తుందని ఆవిడికు కోపం. అందుచేత కుక్కను నేను దొడ్లో పాకలో ఉంచుతున్నాను."

తరవాత అయిదు నిమిషాలకు చూశా నా కుక్కను. ఆ ప్రథమ దర్శనం నాకు చాలా నిరుత్సాహకరంగా ఉంది. ఎందువల్లనో నేను, ఈ కుక్క అన్ని కుక్కలలేనూ ఉండదని భావించాను. బాగా ఆలోచిస్తే అటువంటి భావనకు ఏ మాత్రమూ ఆధారం కనపడదు. అయినా ఇది సామాన్యమైన ఆడకుక్క కడుపున పుట్టిన కుక్కపిల్ల అనిమాత్రం నేను ఊహించలేదు.

అది మొత్తంమీద నల్లనికుక్క, మెడమీదినుంచి ముందు ఎడమకాలిసగం వరకూ వ్యాపించి ఒకటీ, ఎడమకన్ను ప్రాంతాల ఒకటీ తెల్ల మచ్చలున్నై. వెనకకాళ్ళ, కిందిభాగాలు మళ్ళా తెల్లగా ఉన్నై. చూడటానికా కుక్కపిల్ల ఆటే పుష్టిగానైనాలేదు. దాని శరీరంమీద బొచ్చుకూడా పొట్టిగానూ అనారోగ్యంగానూఉంది. ఏ మాత్రమూ నిగనిగ

లాడటంలేదు. ఇక అది మామూలు కుక్క కాదనుకోటానికి ఆధారం ఏమైనా ఉంటే దానికళ్ళే. ఆకళ్ళూ ఆచూపూ నేను ఏ కుక్కలోనూ చూడలేదు. నేను దాన్ని సమీపించగానే అది నా వంక "ఎవడు వీడు?" అన్నట్టు ఒక విచిత్రమైనచూపు చూసింది. దాని మొహంమీద కళ్ళ పైభాగంలో మధ్యగా ఉండే చర్మం— మన కనుబొమలు కలుసుకునే నుదుటి భాగానికి సరిపొయ్యేచోట.. ముడతలు పడ్డది. అంతా మనిషి కనుబొమలు ముడేసినట్టే!

"ఇది ఆటే ఆరోగ్యంగా ఉన్నట్టు కనపడదేంరా?" అన్నాను.

శ్రీనివాసరావు నా చెయిగిల్లి రహస్యంగా "ఇది, అనకు!" అన్నాడు. నాకు మండిపోయింది. ఈ వెధవ కుక్క— కిందటి జన్మలో మనిషి అవుగాక! ఎన్ని కుక్కలు కిందటి జన్మలో రాజాధిరాజులో!—దీనికోసం నేను మర్యాదగా ప్రవర్తించాలా?

నేను కోపంగానే దానివంక తిరిగి, "నా మాటలు నీకు అర్ధం అవుతున్నాయా?" అన్నాను. అది ముక్కులోనించి చప్పుడయ్యేటట్టు గాలి వదిలి పెదిమలు చప్పరించింది

"నీ పేరు సుబ్బారావా?" అన్నాను. కుక్క గుర్రుమన్నది.

"ఆదినారాయణ?" అన్నాను, దాని మొహం జాగ్రత్తగా గమనిస్తూ. నమ్మండి, నమ్మకపోండి ఆ కుక్క మనిషి ఆడించినట్టు తల పైకీ కిందికీ ఆడించింది!

ప్రథమ దర్శనంలోనే దాన్ని చూస్తే నాకు దురభిప్రాయం కొంత కలిగి ఉండకపోతే ఆ తల ఆడించడం నాకు పూర్తి నమ్మకం కలిగించి ఉండవలసిందే. అప్పటికీ నా ఆశ్చర్యానికి మేరలేదు. నేను శ్రీనివాసరావు వంక చూశాను. వాడు నవ్వి కుక్కవంక తిరిగి, "వాడింకా నమ్మలేకుండా ఉన్నాడు!" అన్నాడు. వాడామాట అనగానే కుక్క నన్ను చూడటంమాని వాడి దగ్గిరికి వెళ్ళి వెనక కాళ్ళ మీద కూర్చుని నాలిక బయటికి చాచి, రోజుతూ నవ్వుతున్న దానల్లే వాడివంక చూడటం మొదలుపెట్టింది.

ఇంకొకడికైతే అప్పటికైనా నమ్మకం దృఢపడేదేమో కాని, అది నా ప్రారబ్ధమే అనండి, అది నాలిక బయటపెట్టి రోజటం మొదలు పెట్టగానే దానిమీద నాకు కలుగుతున్న విశ్వాసం కాస్తా పోయింది. తరవాత క్రమంగా నేనుకూడా నమ్మటం ప్రారంభించా ననుకోండి! నమ్మకుండా ఉండటం సులభంకాదు. తెలుగులో ఏ పని చెప్పినా చేస్తుంది— కనీసం చెయ్యగలదు. కాని దానికి ఇష్టం లేని పనులు చెబితే చచ్చినా చెయ్యదు. పైగా గుర్రుమంటుంది. అంత కోపిష్టి ప్రాణిని నే నెక్కడా చూడలేదు. దాన్ని పరీక్ష చెయ్యటానికి ప్రయత్నిస్తున్నామని

తెలిసినా ముండకత్తు ఉంది. దాని ఎడ
కృతజ్ఞతవల్ల నాకు దానియందు గురి
కుదరటం మొదట్లో కొంచెం కష్టమ
యింది. కాని ఆఖరుకు నమ్మాను. అది
ఆదినారాయణ పేర పిలిస్తేనే వినిపించు
కుంటుంది. అంతవరకు నేను రుజువివ్వ
గలను — అయినా ఏ ఆదినారాయణో
చెప్పలేం పైగా ఆదినారాయణ అనే
పేరు దానికి మావాడే అలవాటు చేసి
ఉండినా ఆశ్చర్యంలేదు. అది నిజంగా
కిందటి జన్మలో మనిషే అయిఉంటుందా
లేక ఏమనిషి ఆత్మఅయినావచ్చి ఈకుక్క
శరీరాన్ని ఆవేశించిందా అన్న సూక్ష్మ
విచారణ కూడా నాకు అవసరం లేదు.
నా ప్రాణానికి రెండూ ఒకటే దానికి
మనిషికున్నంత జ్ఞానంఉంది ఆ జ్ఞానం
దీనికి పుట్టిన తరవాత కలిగిఉండటం
అసంభవం. అది రెండు మూడు నెలలు
దాటని పిల్ల!

కాని నేను చెప్పదగినదీ, మీరు విన
దగినదీ ఏమిటంటే నాకా కుక్కమీద
నమ్మకం కుదిరినా మా శ్రీనివాసరావుకు
కుదిరినట్టు భక్తి కుదరలేదు. అది సామా
న్యపుకుక్క కాకపోవచ్చు కాని, సామా
న్యపు మనిషికంటే ఎక్కువమాత్రం
కాదు. కిందటి జన్మలో అది ఎవరోకాని,
ఆమనిషితో నాకు పరిచయం అయిఉంటే
అతనికీ నాకూ స్నేహం అయిఉండదు.
ఈ కుక్కకూ నాకూ ఒక్క రవ్వయినా
మనస్సులు కలవలేదు. ఆ కుక్క అతి
లేక పోయ్యేవాణ్ణి. దానికి మనిషి కున్న
జ్ఞానంఉందని మాకు తెలుసునని దానికి
తెలుసును. తన్ను మేమిద్దరమూ నెత్తిన
పెట్టుకు ఊరేగించకపోతే దానికి కోపం.
దాని "వానిటీ" మావాడు తృప్తిపరిచే
వాడు. నేను దాన్ని నిర్లక్ష్యంగా చూసే
వాణ్ణి. పైగా దాని "ఇన్ఫీరియారిటీ
కాంప్లెక్సు" నేను అసలే సహించలేక
పోయ్యేవాణ్ణి దాన్ని గౌరవించినప్పుడల్లా
అగౌరవంగా చూస్తున్నారనే! నేను మా
సంభాషణలో దాన్నికూడా చేర్చకపోతే
మండిపడేది—తనమంట అనేక విధాల
చూపించేది.

మావాడికికూడా నా ప్రవర్తన రుచిం
చలేదు. "ఏమిట్రా నీకీ కుక్కలో ఇంకా
నమ్మకం కుదరలేదా—లేకపోతే ఏమిటి?
దీన్ని డిస్కవరు చేసినప్పటినించీ నాకు
పెన్నిధి దొరికినట్టుంది. ఇటువంటి ఫినా
మినన్— ఇంత విచిత్రం!—కళ్ళారా
చూసికూడా చలించవే! నీకేమీ ఆశ్చ
ర్యంగా లేదా?" అన్నాడు వాడు.

"ఆశ్చర్యం! విపరీతమైన ఆశ్చర్యం
గాఉంది. ఇది చూసినప్పటినుంచీ ఇటు
వంటి చిత్రాలన్నిటికీ కారణభూతమయిన
శక్తిని గురించి నా అభిప్రాయం మరింత
భక్తితో కూడుకున్నదయింది ఆ భక్తి
ఈ చిన్నకుక్కమీద చూపించమంటే నా
చాతకాదు కావాలంటే ఇతర కుక్కలను
దీనియందు భక్తితో సంచరించమను.

లా తయిలు? మనిషిగా మెచ్చుకోలసివ్యక్తిని కుక్కగా ఎట్లా మెచ్చుకోమంటావు ?" అన్నాను.

"నీలో నిజమైన శోధనోద్రేకం— రిసెర్చి స్పిరిటు—లేదుపో !" అన్నాడు మావాడు. నేను అప్పుడే చూపించిన నిర్లక్ష్యత తరవాత క్రమంగా లోకమంతా చూపించిన సంగతి మావాడు గుర్తించే ఉంటాడనుకుంటాను !...

అవును, తరవాత కొద్దిరోజులకే ఈ కుక్క మావాడి సొత్తుకావటంమాని లోకం సొత్తయింది...

నేను ఆ నాలుగురోజులూ కోడూరులో ఉండి, సోమవారం చీకటితో లేచి స్కూలుకు అందుకున్నాను. మళ్లీ శుక్రవారం సాయంకాలం రమ్మని శ్రీనివాసరావు నన్ను మరీ మరీ అడిగాడు. ఈ లోపల కొంత "మెమొరాండా" కూడా తయారుచేస్తానన్నాడు "ఆదినారాయణ" ను గురించి.

శ్రీనివాసరావు ఒకటి తలిస్తే లోకం ఇంకొకటి తలిచింది. గురువారం నాడే కోడూరు వితంతువులు ఇద్దరు ముగ్గురూ, ఒక తరంగాలు పాడే ఆయనా కలిసి "ఆదినారాయణ" కాలభైరవుడని కని పెట్టారు !...

ఆ వూళ్లో ఒకచోట రోజూ సాయంకాలంపూట భజన జరుగుతూ ఉంటుంది. ఒకనాడు "ఆదినారాయణ" అక్కడికి వెళ్ళి భజన వింటున్నది. భజనచేసే వాళ్ళలో కొందరు కొట్టబోతే గుర్రుమన్నది. ఆ తరంగాలు పాడే ఆయన—తన కొంపలో రోజూ కుర్రవాళ్లను కొడుతూనే ఉంటాడు— ఆ కుక్కకు చేతులెత్తి నమస్కారంచేసి "ఆ శ్రీమన్నారాయణమూర్తే ఇట్లావచ్చి వింటున్నాడు మనస్తోత్రాన్ని ! ఉండనివ్వండి " అన్నాడు.

మరుక్షణమే "ఆదినారాయణ" మంచి ఉపాయం ఆలోచించింది. అది వెంటనే వెళ్ళి దేవుడిపటం ముందు కూర్చుని భజనచేసే వాళ్లవంక "ఇక మీ పని మీరు చెయ్యండి" అన్నట్టు చూచింది.

చిత్రం ఏమిటంటే అందులో ఒక వితంతువుకు ఆ కిందటి రాత్రే శ్రీమన్నారాయణుడు కుక్కస్వరూపంతో కనిపించి "నేనువస్తున్నాను, మీభజన మందిరం పావనం చేస్తున్నాను" అన్నాడట. ఆవిడ ఒక్కత్తెకే అటువంటి కల వచ్చివుంటే అది నమ్మదగిన విషయంగా ఉండిఉండేది కాదేమో కాని, ఇంకో వితంతువుకు కూడా అటువంటి కలే రావటంవల్ల మొదటి ఆవిడ కల అబద్ధం అయిఉండటం అసంభవమయింది... అయితే రెండో విధవకు కలలో కనిపించింది, శ్రీమన్నారాయణుడుకాడు. వెంకటేశ్వరస్వామి—నామాలూ, కాళ్ళదాకా ఉత్తరీయమూ, బాడెడు రేకు చెప్పులూ; నల్లటి విగ్రహం; ఆ తెల్లటి నామం కాస్త ఎడమ కంటిమీదికి



ఉన్నట్టూ. తెల్లటి ఉత్తరీయం కుడిభుజం మీద స్పష్టంగా కనిపించినట్టూ, పాదాలు వెండి పాదాలయినట్టూ ఆ రెండో విధవకు స్పష్టంగా కళ్ళకు కట్టినట్టుంది !...

తరవాత కథ నేను చెప్పనక్కర్లేదు మా ప్రాంతాల అందరికీ తెలుసు. ఈ కాలభైరవస్వామి రాకతో కోడూరు పుర వాసులు నాగుమయ్యను కూడా మరిచారు. ఆ రోజు కా రోజు గడిచినకొద్దీ అనేక వేలమందికి కలలో సాక్షాత్కరించి, కోరిన కోరికలు తీర్చసాగారు. అనేక వేలమంది సంతానం లేనివారు స్వామి వారి అనుగ్రహంవల్ల సంతానం కన్నారు అట్లా కన్న స్త్రీని ఒకామెను నేను స్వయంగా ఎరుగుదును. ఆవిడకు సంతు లేని మాటా తరవాత కలిగిన మాటా నిజమేకాని, ఆవిడ స్వామివారిని దర్శించి వచ్చిన తరువాత ఏడునెలలకే కలిగాడు శిశువు !...

భజనమందిరం పూజామందిరంగా మారింది. రోజూ స్వామివారి సాన్నిధ్యంలో వేదపఠనమూ, స్వామికి షోడశ పూజలూ, ఇంకా ఏమిటో ఏమిటో ! రాత్రి కాగానే అక్కడే స్వామికీశయ్యా!

పరుపు పరచి, తెల్లని ఇస్త్రీ మడతలు పరిస్తేనేకాని స్వామివారు పడుకోరు. అచ్చు శాకాహారం తప్ప ముట్టరు. ఉదయంపూట కాఫీ ఉప్మాలు సేవిస్తారు.

ఈవిధంగా ఆరునెలలు జయప్రదంగా వెళ్ళింది. అకస్మాత్తుగా కాలభైరవుడి ప్రశంస అందరూ మానేశారు....

భగవంతుడైనాసరే మనిషిజన్మఎత్తితే మనిషియొక్క శరీరతత్వమూ గుర్తించి తీరాలి. అక్కడ ప్రకృతికి భిన్నంగా వెళ్ళితే ప్రమాదంవుంది. ఈ కుక్కకు అంత వివేకం లేకపోయింది. తనకు అందుబాటులో ఉండేనియమాలు అవలంభించక అది ఆశకుపోయి, మనిషి మెప్పుకోరి, మనిషి నియమాలు అవలంబించటంవల్ల దానికి ఒక విధమైన రుగ్మత ప్రారంభమయింది. దాని శరీర తత్వానికి అనుగుణ్యమైన ఆహారం పడలేదు.

దానిలో ఉన్నమనిషి బుద్ధిని కుక్క శరీరం చివరకు జయించనే జయించింది. అది చాటుగావెళ్ళి దానికి కావలసిన ఆహారం దొంగిలించి తినసాగింది. ఒకసారి తనసహజమైన ఆహారాన్ని రుచి చూచినతరవాత దానికీపూజలూ, పునస్కారాలూ, లోకం తనకు ఆరోపించిన కాలభైరవత్వమూ మొదలైన వాటిమీద విముఖత్వం బయలుదేరింది. చేజేతులా ఈ పీడ తెచ్చిపెట్టుకున్నందుకు దానికి పరివేష్టించుకుని ఉండే భక్తసముదాయం మీద దానికి ఆగ్రహం జాస్తి అయింది. వాళ్ళు తన్ను ఒకక్షణం ఏమరిఉండరు. అర్ధరాత్రివేళ. తను చడీ చప్పుడూ లేకుండా బయటికి పోతున్నా ఎవడో ఒకభక్తుడు, హాయిగా నిద్రపోతూ ఉండవలసిన వెధవ, తల ఎత్తి "స్వామీ ఎక్కడికి?" అని తోడు వస్తాడు.

తను చేతులారా ఇదంతా తెచ్చి పెట్టుకున్న మాటకూడా మరచిపోయి, తనను భక్తులంతా నిర్బంధిస్తున్నారన్న భావం కూడా దానికి కలగటం, నేను సులభంగా ఊహించగలను. ఆఖరుకు అది ప్రతివాళ్ళమీదా గుర్రుమనసాగింది.

కాలభైరవుడి మనసు సరిగాలేదని అందరూ గ్రహించారు. స్వామికి ఆగ్రహం వచ్చిందన్నారు. దానిచుట్టూ ఇరవైనాలుగు గంటలూ భజనలూ, ఊరంతా సంతర్పణలూ ప్రారంభించారు. ఆ కుక్కకు పూర్తిగా వెర్రెత్తిపోయింది. కాలభైరవుడు తన అత్యంత ప్రియశిష్యుడైన తరంగాలుపాడే పెద్దమనిషి పిక్కపట్టుకుని కండ ఊడేదట్టు పీకిందన్న వార్త దశదిశలా వ్యాపించింది.

మర్నాడే కాలభైరవుడు అదృశ్యుడైనాడు. కొంతకాలంనుంచీ స్వామివారు భక్తులపైన ఆగ్రహంగా ఉండటమూ, ఆఖరుకు అదృశ్యుడు కావటమూ చూసి ఏదో మహాపచారం జరిగిందని



యువ

అనుమానించసాగారు భక్తులలో అంతః కలహాలు బయలుదేరి బహిఃకలహాలూ, తిట్టుకోటాలూ,కొట్టుకోటాలూగా పరిణమించినై.

తరవాత కొన్నిరోజులకు చేబోలు గ్రామంలో ఒక బలిసిన, నల్లగా నిగనిగలాడే కుక్క, మరొక ఆడకుక్క వెంటపోతూండటం చూసి. ఒక పెద్ద మనిషి నిర్ఘాంతపోయి నిలబడ్డాడు. కొంత కాలం కిందట ఆయన కోడూరువెళ్ళి కాలభైరవుణ్ణి సందర్శించివచ్చాడు. ఈ కుక్క అచ్చంగా ఆ కాలభైరవుడికి అన్నో తమ్ముడో అన్నట్టుంది. కాలభైరవుడు అదృశ్యమై అప్పటికి వారం రోజులయిందని ఆయన భార్య చెప్పి ఉండకపోతే, ఆయనకు ఈ కుక్కే కాలభైరవుడా అన్న సందేహం కలిగి ఉండవలసిందే ?...

తరవాత తరవాత క్రమంగా చాలా విషయాలు బయటపడినై. మధ్య మధ్య ఈ కుక్క ఎంగిలి విస్తరాకులు నాకటమూ, బొమికలు కొరికి చూడడమూ చూసినవాళ్ళున్నారు. తన వంటయింటో ప్రవేశించి అన్నపు కుదుడు ఎతుకుపోతుంటే ఒక ఇల్లాలు చేతిలోఉన్న కట్టె పేడు విసిరివేసిన తరవాత కాలభైరవుణ్ణి కుని ఇదంతా రహస్యంగా దాచిపెట్టింది. కాలభైరవుడు అంతర్ధానం అయిన తరవాత క్రమంగా ఈ కథలన్నీ ప్రచారంలోకి వచ్చినై....

మొన్న ఈ మధ్యనే శ్రీనివాసరావు మళ్లా నాకు కనిపించాడు. వాడిదగ్గిర ఈ సంగతి తెస్తే, "ఛా! ఆ వెధవకుక్క సంగతి యెత్తకు! దీనికోసం ఒకరాత్రల్లా వెతికి, మర్నాడు ఉదయం భజనమందిరంలో ఉందని విని చూడబోయినాను. నన్ను చూడగానే బొంయిమని మీదికి వచ్చింది. ఆ తరంగాలు పాడే పీనుగ—వాడికీ నాకు పడదు, అదంతా చాలా కథ ఉందిలే!— నేను వినేట్టు "స్వామివారికి భక్తులెవరో పతితులెవరో తెలుసూ ;" అన్నాడు...

"మొత్తానికి మంచి ఎత్తేవేసింది. దాని బతుకు నాకు తెలుసునని దానికి తెలుసు— వెధవకు !"

దానికి భగవంతుడు ప్రసాదించిన శక్తిని అది వృధా చెయ్యకుండా, ఆ శక్తిని కుక్కల జాతియొక్క మేలుకే ఉపయోగించితే అజాతికి చాలా మేలు చేసినదయ్యే దనుకుంటాను ఈ "ఆదినారాయణ!"



జూలై నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10_00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమానమివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తరప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు జూన్ 5వ తేదిలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుము లేదు.




ఆఫీసునుండి వస్తూనే, పాంటు జేబులో నుండి ఒక కవరు తీసి పద్మ చేతిలో పెట్టాడు వెంకట్రావు. "ఎక్కడిది?", అన్నట్లు భర్తవేపు ప్రశ్నార్థకంగా చూసింది పద్మ, "చదువు, నీకే తెలుస్తుంది" అంటూ టవలు తీసికొని స్నానానికి వెళ్ళిపోయాడు. "ఎవరు రాసారమ్మా? తాతయ్యగారా?" అంటూ పదేండ్ల గిరిజ పద్మవేపు ఆసక్తిగా చూసింది. "ఏమో! చదవనీ" అంటూ ఉత్తరం విప్పింది పద్మ.

ప్రియమైన అన్నయ్యకి,

ఇక్కడ మేమందరం క్షేమం. అక్కడ మీరందరు క్షేమమనుకుంటాను. చి|| శైలు ఈ మధ్యనే ఫ్లూ జ్వరంతో బాధపడింది. ఇప్పుడు కులాసాగానేవుంది. అక్కడ చిరంజీవులు గిరిజ, జలజ, రాము కులాసా అనుకుంటాను.

అన్నయ్యా. మీ బావగారిని ఆఫీసువాళ్ళు ట్రెయినింగ్‌కి బొంబే పంపిస్తున్నారు. రెండు నెలలు వుంటారు. ఫామిలీ ప్లానింగ్ ట్రెయినింగ్ కొరకు నేనుకూడ వెళ్ళవలెనని వున్నాను. శైలుతోటే మాకు చిక్కు వచ్చిపడింది. శైలుని ఈ రెండు నెలలు మీ దగ్గరే వుంచుదామని వుంది. అమ్మ దగ్గర అయితే దానికి కంపెనీ వుండదు. అందులో అది మరీ పల్లెటూరు. దీనికి అస్తమానం ఏదో ఒక సుస్తీ చేస్తూ వుంటుందాయె. నేను, శైలు ఆదివారం బయలుదేరి అక్కడికి వస్తున్నాము. వదినను అడిగినట్లు చెప్పేది. ఇంతే,

ఇట్లు
మంజుల.

ఉత్తరం చదవడం అవగానే దాన్ని టేబిల్ మీద పెట్టి, పద్మ భర్తకి కాఫీ తీసుకు రావడానికి లోపలికి వెళ్ళింది. ఉత్సుక తను చంపుకోలేని గిరిజ ఉత్తరం చదవ సాగింది. వెంకట్రావు గదిలోకి రాగానే "నాన్నా! శైలు, అత్తయ్య వస్తారట కదా! శైలు మనింట్లో నే వుండిపో తుందా?" అంటూ ఎంతో అమాయ కంగా, సంతోషంగా అడిగింది. "ఏమో నమ్మా! హోమ్ మినిష్టర్ పర్మిషన్ కావాలిగా ముందు" అంటూ భార్య చేతి లోని గ్లాసు అందుకున్నాడు. "పాపం! అప్పటికి నా మాట జవదాటనట్లు!" పద్మ తనవీ, తన సంసారాన్ని ఎన్నో తప్పులు పట్టింది. పిల్లలకి క్రమశిక్షణ నేర్పటం తెలీదు అంది. పిల్లలకి సరయిన ఆహారం ఇవ్వడంలేదని చెప్పింది. ఎంతయిన డాక్టరు కదా! ఆవిడలాగ పెంచడం తనకెలా చాతనవు తుంది. అని సరిపెట్టుకుంది పద్మ. కాని ఆ ఎత్తిపొడుపులు, హేళనా పూరిత వాక్కులు పద్మమర్చిపోలేదు. ఒక్కనాడు తన పిల్లలను పిలిచి తన యింట్లో వుంచుకోలేదు. తను వచ్చినా, పట్టుమని పదిరోజులు వుండకుండ తుర్రుమనేది ఇప్పుడు అవసరం తనది కదూ! ఎంతో వినయంగా ఉత్తరం వ్రాసింది "మీరే మంటారు రాణీగారూ!" అన్నాడు వెంకట్రావు పేపరు అందుకుంటూ. "అదేంటండీ! నన్నడుగుతారు? అన్న గారాయె, చెల్లెమ్మాయె! నే నెవర్ని మధ్యన? నేను వద్దంటే మాత్రం ఆవిడ రాకుండా వుంటుందా? మీరు రమ్మన కుండా వుంటారా?". పద్మ జలజని కేకేసి, దాని జడలు విప్పడం మొద లెట్టింది.

"పద్మా! మంజుల పరిస్థితి కూడా కొంచెం ఆలోచించు. అసలే దానికి పిల్ల మీద మమకారం ఒక పాలు ఎక్కువ" "ఆ మాటే అనొద్దంటాను! ఎవరి పిల్లలు ఎవరికి ఎక్కువకాదు.!" "ఆవేశ పడకు మరి! ఒక్కగానొక్క పిల్ల. అందులో

కాదు ఎటూ వీలుకాని పరిస్థితి. ఒక రెండు నెలలే కదా! మనింట్లో వుండనీ" "ఇప్పుడు నేను కాదన్నానటండీ! ఎటొచ్చీ డాక్టరు మంజులలాగ పిల్లల్ని పెంచడంమాత్రం నాకురాదన్నదిమీరిద్దరు మర్చిపోకండి" జలజ జడకి రిబ్బను బిగిస్తూ అంది పద్మ "ఊ...సరేలే... ఎప్పటి మాటలో పట్టుకుని ఇప్పుడు చెప్పుతున్నావు! అయినా మంజుకి ఎవరున్నారు! మనం తప్ప. మన మీద ఆపేక్షవల్లకాని లేకుంటే దాని కూతుర్ని లక్షవరహాలు పోసినా మనింట్లో వుంచుతుందా?" "సరే! ఆ లక్షవరహాలేవో మీరే ఏరుకుందురుగాని నాకు పనుంది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది పద్మ.

తన చెల్లెలు మంజులకి, పద్మకి చాలా విషయాల్లో అభిప్రాయ భేదాలు వున్నవి అన్న విషయం వెంకట్రావుకి తెలియక పోలేదు. కాని ఇంటికొచ్చిన అతిథిని అవమానించేంత కుత్సిత బుద్ధి మాత్రంకాదు పద్మది అన్న నమ్మకమే వెంకట్రావుకి ధైర్యాన్నిచ్చింది.

శైలు వచ్చినందుకు పిల్లలు గంతు లేశారు. కలిసిపోయి ఆడుకున్నారు. ఎప్పుడూ హాస్పిటల్ అనే చెల్లెలు, సావకాశంగా ఇంట్లో కూచుని కబుర్లు చెబుతూంటే వెంకట్రావుకి ముచ్చటేసింది. పద్మ కూడ ఆడబడుచుకి ఏలోటు లేకుండ అన్నీ చేసిపెట్టింది. మూడు రోజులూ మూడు క్షణాల్లా గడిచి పోయాయి.

ఆ రోజే మంజుల వెళ్ళేరోజు. శైలు, తీరా తను వెళ్ళేటప్పుడు గోల చేస్తుందేమో అని అన్నయ్యతో పార్కుకి పంపేసింది. ముందుగానే అన్నయ్య దగ్గర వీడ్కోలు తీసుకుంది. పద్మ, మంజుల ఇద్దరు కలిసి స్టేషన్‌కి వచ్చారు. దారిపొడుగునా అప్పగింతలు పెడుతూనే వుంది మంజుల. "వదినా! శైలుకి రోజూ కోడిగ్రుడ్డు, పాలు ఇవ్వు. ప్రొద్దుట టిఫిన్‌కి దానికి బ్రెడ్ అలవాటు. కొద్దిగ టోస్టు చేసి ఇవ్వు. నెయ్యి ఎక్కువగా వాడకు" అన్నిటికీ వూకొట్టింది పద్మ. "దానికి అస్తమానం జలుబు చేస్తుంది వదినా! దాని పెట్టెలో స్వెట్టరు, మేజోళ్ళు పెట్టాను, రాత్రిళ్ళు వేసి పడుకోబెట్టు" తనొక్కతే పిల్లను పెంచుతున్నది. చెప్పే కబుర్లు వింటూంటే పద్మకి చిర్రెత్తుకొచ్చింది కాని అనవసరంగా, గొడవెందుకని మౌనంగా వుండిపోయింది. ఆకలికి ఒక టానిక్కు. తిన్నది అరగటానికి ఒక మందు, జ్వరానికి ఒకటి, దగ్గుకొకటి ఇలా ఎన్నోమందుల పేర్లు వ్రాసి ఇచ్చింది మంజుల. మళ్లీ ఏకరువు పెడుతూంది. పద్మకి చిరాకేసి ప్రయాణీకులకేసి దృష్టి సారించింది. "వదినా! పండ్లరసం, పాలు రెగ్యులర్‌గా ఇవ్వండి. దాని ఖర్చుకి నెలనెలా నేను వంద రూపాయలు పంపుతాను" అంటున్న

తిరిగింది పద్మ. కోపంగా తనకేసి చూస్తున్న వదిన చూపులలోని వేడిని గమనించే స్థితిలో లేదు ఆతల్లి ఆతురత. ఇక మాటలు చాలించండి, అంటూ శైలు ముందుకు సాగిపోయింది. వికలమైన మనస్సుతో ఇంటికి వచ్చింది పద్మ.

భర్త వచ్చీ రావడంతోటే అతని మీద విరుచుక పడింది. "ఏమిటి మీ అన్నాచెల్లెండ్ర వుద్దేశం? డబ్బు పంపుతుందట గదా! మీ ముద్దుల చెల్లెలు. ఇదేమైనా పూటకూళ్ల ఇల్లు అనుకుందా? ఆ సంగతి ముందే తెలిసివుంటే శుభ్రంగా ఏ బోర్డింగ్‌లోనే చేర్పించ మనేదాన్ని" పద్మ కోపంతో, అవమానంతో వుడికిపోతూంది. వెంకట్రావుకి భార్యని చూస్తే జాలేసింది "ఛా..."ఎందుకలా అపార్థం చేసుకుంటావు? పిల్లలు కల వాళ్ళం కదా అని..." "అందుకని ఆవిడ దానంచేస్తే మీరు భిక్ష పట్టారా?" "మంజుల ఛాదస్తంగా ఏదో అన్నది నువ్వేం పట్టించుకోకు. అవసరం అయితే వాడుకుందాం. లేదంటే తిప్పిఇద్దాము. భార్యని అనునయిస్తూ అన్నాడు వెంకట్రావు. నా పిల్లలతో బాటు అనుకున్నాను. కాని ఆపిల్లని పేయింగ్‌గెస్టుగా నేను గ్రహించలేదు. ఇది మీరూ, మీ చెల్లి గుర్తుంచుకోండి" అంటూ ఆ ప్రసంగాన్ని అంతటితో ఆపేసింది పద్మ.

కాలండర్‌లోని కాయితాలు రెండిటివి గేండ్ల శైలు. మూడవ కాయితం కేసి చూస్తున్న శైలుతోపద్మ "శైలూ! ఇంక నాలుగైదు రోజుల్లో మీ అమ్మ వచ్చేస్తుంది. అమ్మతో వెళ్ళి అత్తయ్యను మర్చిపోతావు కదూ!" అంది ఊహూ, మమ్మీని కూడ ఇక్కడే వుండమంటాను" అంది ముద్దుగ శైలు. "నా తల్లే" అంటూ ఎతుకుని ముద్దాడింది పద్మ. "ఏమిటో అత్తాకోడండ్లిద్దరూ మురిసి పోతున్నారు" అంటూ టెలిగ్రాం చేతపట్టుక వచ్చాడు వెంకట్రావు. "మీ కోడలు ఇక్కడే వుండిపోతుందటండీ! అంది పద్మ మళ్లీ శైలును ముద్దు పెట్టుకుంటూ. "ఇంకెన్నాళ్ళులే ఆ మురిపం! మంజుల రేపు సాయంత్రం వస్తానని టెలిగ్రాం ఇచ్చింది "మమ్మీ వస్తుందా మామయ్యా" అంటూ గంతులేసింది శైలు.

ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లో వస్తున్న మంజుల మనస్సు మహా త్వరితగతి పరుగులు తీస్తూంది ఈ రెండు నెలలు ఎలా వుందో కాని ఈ రెండు గంటలుండటం కష్టమైపోతూంది మంజులకి. తనకే రెక్కలుంటేనా! శైలు దగ్గర ఈ క్షణం వాలిపోనూ. అనుకుంది మంజుల. ఏం బెంగెట్టుకోలేదు, కులాసాగానే వుంది, అంటూ అన్నయ్య ఉత్తరాలు వ్రాస్తూనే వున్నాడు. కాని మంజుల హృదయం మాత్రం కూతురి కోసరం




కొట్టుకపోయింది. మంజుల భర్త కూడ ప్రయాణమయ్యాడు. కాని లాస్ట్ మినిట్ లో మినిష్టర్ ప్రోగ్రాం రావడంతో ఆగి పొయ్యాడు.

స్టేషన్ లో ఆగీ ఆగకముందే బయట కురికింది మంజుల. కళ్ళు ప్లాట్ ఫారమ్ని అన్వేషిస్తున్నాయి. ఇంతలో "మమ్మీ" అంటూ శైలు పరుగున వచ్చి మంజులని వాటేసుకుంది. వెనకాలే వెంకట్రావు చిరునవ్వుతో వచ్చాడు. వంగి కూతుర్ని అమాంతం ఎత్తుకొని హృదయానికి అదుముకుంది మంజుల. బొద్దుగా, ఆరోగ్యంగా, కళగా వున్న కూతుర్ని ఆప్యాయంగ చూసుకుంది మంజుల. శైలు వెయిట్ని కళ్ళతోనే వే చేస్తున్నట్లున్నావ్" అంటూ దగ్గరగా వచ్చాడు వెంకట్రావు.

"పో అన్నయ్యా" అంటూ కూతుర్ని మరింత గట్టిగా హృదయానికి అదుముకుంది.

మంజుల రాకతో ఇంట్లో చెప్పలేనంత హడావిడి. "మమ్మీ. మమ్మీ" అంటూ శైలు నోరు మూత వేయకుండ కబుర్లు చెబుతూంది. ఎప్పుడూ తనవెంట తిరిగే శైలు, అమ్మ కూతురయిపోయింది అని నవ్వుకుంది పద్మ. అందరితోబాటు శైలు కూడ ఇడ్లీలు, రొట్టెలు ఇష్టంగా తింటూంది, ఆకలి అత్తయ్యా! అన్నంపెట్టు అని అడిగి భోంచేస్తూంది. ఆఖరికి చారుఅన్నం అయినా సరే ఎంతో రెలిష్ చేసి కూతురు తినడం మంజులకి ఆశ్చర్యం కలిగించింది. ఇంటి దగ్గర రకరకాల డిష్స్ తో తినమని

పండ్లరసం. పాలు అయినా బ్రతిమాలి, బెదిరించి ఇవ్వవలసి వచ్చేది కాని ఇక్కడో! అన్నయ్య పిల్లలతోపాటు ఆబగ అన్నము తినేయటం చూస్తే మంజులకి కొంచెం బాధ కూడ అనిపించింది. తానంతగా చెప్పిపోయినా, వీళ్లు తన కూతుర్కి స్పెషల్‌గా ఏమీ ఇవ్వడం లేదు అన్నది స్పష్టమయింది. ఏదయితేనేం తన కూతురు ముందుకన్న కూడ ఆరోగ్యంగావుంది, అని మనసును సరిపెట్టుకో ప్రయత్నించింది. కాని హృదయంలో ఎక్కడో కలుక్కుమంటూనేవుంది. శైలుతో సంతోషంతో కబుర్లు చెబుతూంది. కాని అన్నయ్య, వదినతో మాత్రం కాస్త ముభావంగా వుండిపోయింది.

మంజుల ఊరికి ప్రయాణమవుతూంది. పద్మ అవీ, ఇవీ తినుబండారాలు తయారుచేసింది. చక్కిలాలు, సున్ని వుండలు పెడుతూంటే "ఇవన్నీ ఎవరు తింటారొదినా!" అంది విసుగ్గా మంజుల. "అదేంటి మంజూ! సున్ని వుండలంటే శైలుకి ప్రాణం" అంది పద్మ. "ఔను, మమ్మీ. భలేగా వుంటాయి. అత్తయ్య రోజూ నాకు నెయ్యివేసి మధ్యాహ్నం పెడుతుంది" అంటూ ఒకటి తీసి నోటిలో వేసుకుంది శైలు. మంజుల మరేమీ మాట్లాడక పెట్టె సర్దుకోసాగింది. శైలుకి పెందలాడే చంక నేసుక వెళ్ళింది. జలజ, గిరిజలు శైలు వెంబడే తిరుగుతున్నారు

"మంజూ!" అంటూ వెంకట్రావు చెల్లెలి దగ్గరకొచ్చాడు. "ఏమిటి?" అన్నట్లు లేచి నించుంది మంజుల "ఇదిగో నమ్మా! నువ్వు ఈ రెండు నెలలు పంపిన డబ్బు" అంటూ రెండు వంద రూపాయల నోట్లు చెల్లెలి చేతిలో పెట్టాడు. పరధ్యానంగా నడుస్తున్న పాంథునికి పెద్ద ఎదురు దెబ్బ తగిలినట్లయి, మంజుల చివ్వున తలెత్తి చూసింది. చిరునవ్వుతో వెంకట్రావు చెల్లి చేతిలో పెట్టాడు "అన్నయ్యా" అంటూ ఏదో అనబోతున్న మంజులను వారిస్తూ మంజుల చేతిని మూసేశాడు. "అయితే! మీరు నా కోసరం అనవసరంగా అప్పులయినా చేస్తారు కాని నా డబ్బు వాడుకోరన్నమాట" మంజుల కొంచం వుక్రోషంగా అంది. "మంజూ! ఎవరు చెప్పారు నీకు మేము అప్పుల్లో బ్రతుకుతున్నామని. పెద్ద డాక్టరువయితే అయ్యావు కాని నీ చిన్నప్పటి తొందరతనం అవివేకం ఏమీ పోలేదు. నీ కూతురి పోషణ కోసరం అప్పులు చేసేంత దుస్థితికి ఈ అన్నయ్య ఇంకా రాలేదు. నాతో అంటే అన్నావు కాని మీ వదినతో ఈ మాట అనేవ్, చాలా బాధపడుతుంది" అంటూ వచ్చినంత నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు వెంకట్రావు.




చేతిలో డబ్బుతో నిలబడ్డ మంజులకి చెప్పలేనంత బాధ కలుగసాగింది. **ఛీ...ఛీ...తానెంత అహంభావి! ఎంత మూఢురాలు!** తన డబ్బు వాళ్ళేదో స్వంతానికి వాడేసుకున్నారని ఎంత కుత్సితంగా ఆలోచించింది. ధన మదాంధకారం అంటే ఇదే కాబోలు. మధ్య తరగతి కుటుంబీకుడు అన్నయ్య అన్న చులకన భావమే కదూ, తనని నెల నెలా డబ్బు పంపించేలా చేసింది. ఎంత మెత్తగ గుణపాఠం చెప్పారు తనకి. అన్నయ్య పిలలు తన రక్తసంబంధీకులే అయినా ఏనాడూ వాళ్ళని దగ్గరికి చేరదీయలేదు అత్తయ్యగా ఆప్యాయత చూపలేదు. ఇంతెందుకు? ఇంతదూరం వస్తూ పసి పిల్లలకి ఏమైనా తెద్దామన్న ఆలోచన అయినా రాలేదు. నెల నెలా పంపిస్తున్నాను కదా అన్న ధీమా కదూ తనది! కాని తన వదినో! తన పిల్లలకన్న ఎక్కువ అనురాగంతో చూసుకుంది తన కూతుర్ని" సిగ్గుతో, అవమానంతో. లజ్జతో చితికి పోసాగింది మంజుల.

"అరే! వుండండ్రా! అత్తయ్యకి చూపనీ" అంటూ పద్మ శైలుని మంజుల దగ్గరికి తెచ్చింది. క్రొత్త లంగా, జాకెట్టులో ముద్దొస్తూంది శైలు. వెనకే పాత బట్టలతోనే వున్నా గిరిజ, జలజలు చిరునవ్వులతో వెలిగిపోతున్నారు. వాళ్ళందర్నీ చూస్తూంటే తానెంత అల్పురాలో అర్థమవసాగింది. పద్మ శైలుని దింపి

...ల ఎలా వున్నది. ...! ఎలా వుంది" అంటూ తన దగ్గరికి వచ్చిన శైలుతో బాటు గిరిజ. జలజలను దగ్గరకు తీసుకుంది మంజుల.

పసుపు. కుంకుమతో బాటు చీర. మంజుల చేతిలో పెట్టింది పద్మ. చీరతో బాటు చటుక్కున వంగి వదిన పాదాలని చేతితో తాకింది మంజుల. ఆడబిడ్డ చేష్టకి ముగ్ధురాలైన పద్మ, మంజులని ఆప్యాయంగా లేవనెత్తింది. మంజుల కండ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. "ఛా... ఏంటిది? మంజూ! ఏమయింది" అంటూ పద్మ మంజు కళ్ళు తుడిచింది. "వదినా! నా కూతురి పోషణకి విలువకట్టి డబ్బు పంపానే కాని నీ మాతృ ప్రేమామృతానికి విలువ కట్టలేనమ్మా" అంటున్న మంజులని వారించింది పద్మ. మంజుల ఆవేశాన్ని అర్థం చేసుకుంది. "బాగానే వుందమ్మా నువ్వనేది! అది నీకు కూతురే కాని నాకేమీ కాదా! నా ముగ్గురి పిల్లలతో బాటు అది నాలుగో పిల్ల అయింది. దాని కోసం నేనేం ప్రత్యేకం ఖర్చు పెట్టలేదు. నువ్వు అనవసరంగా నాకేదో గొప్పదనం ఆపాదించకు. ఒంటిత్తుగ వున్నా పల్లమా, నలుగురిలోకి వచ్చాక కాస్త వుషారుగా వుంది, ఆరోగ్యంగా వుంది" సామాన్యంగా చెప్పుకపోయింది పద్మ. కాని మంజుల తన ఆవేశాన్ని అరికట్టుకోలేక పోయింది. తన చేతిలోని డబ్బుతీసి మేనగోడళ్ళిద్దరి చేతిలో పెట్టింది. వారించబోతున్న వదిన్ని అవతలకి నెట్టింది "నా ఇష్టం! నా మేనగోడళ్ళకి నే నిచ్చుకుంటాను. నువ్వు అనవసరంగా జోక్యం కలుగజేసుకోకు" అంటూ గోముగా కసిరింది పద్మని. "అలా అన్నావు బాగుంది. ఎన్నాళ్ళనుంచో కలలు కంటున్నారు కదా, కంచిలంగాలో అంటూ, అత్త పేరు చెప్పి కుట్టించుకోండి. పిల్లలూ!" అని అంటున్న భార్య వేపు అనురాగంగా చూస్తూ వచ్చాడు వెంకట్రావు. "అంతా మీ అమ్మాయిలు పంచుకోవడమేనా! నా కొడుక్కి వాటా ఏది?" అన్నాడు కొంటెగా! "కొడుక్కి కోడలే బహుమతి" అంది నవ్వుతూ మంజుల. అందరు గొల్లున నవ్వారు. ఎందుకో అర్థం కాక పోయినా శైలుకూడా నవ్వేసింది.



# స్వయంకృతం

## గోపీచంద్

"ఎక్కడికి ప్రయాణం అవుతున్నావు" అని అడిగాడు. గోపాలం పెట్టె సర్దుకుంటున్న భార్య శ్యామలను చూచి.

శ్యామల మాట్లాడలేదు. రుసరుసమంటూ పెట్టె దభాలున మూసింది. తన భార్య చాలా కోపంగా వుందని అతను గ్రహించాడు. ఇటీవల చీటికీమాటికీ తన భార్యకు కోపం రావటం, చాలా స్వల్ప విషయాలమీద కీచులాడటం జరుగుతూ వుంది. అతనికి చాలా కష్టంగా వుంటూ వుందిగాని ఎంత ఆలోచించినా, ఆమె ప్రవర్తనకు తగిన కారణం అగుపించేది కాదు. అందుకని కాలమే అన్నీ చక్కబరుస్తుందనే విశ్వాసంతో మెదలకుండా ఊరుకుంటున్నాడు.

"మాట్లాడవేం ?" అన్నాడు గోపాలం.

"నాకు ఎవరితో మాట్లాడవలసిన అవసరంలేదు. నేను మా అన్నయ్య దగ్గరకు వెళ్ళిపోతున్నాను" అన్నది శ్యామల. అని పెట్టె తీసుకొని బయటకు బయలుదేరింది.

గోపాలం కొరడా దెబ్బ తిన్నట్టు ఉలిక్కి పడ్డాడు. అతనికి ఒక్క క్షణం ఏమీ అర్థంకాలేదు. కళ్ళయెదుట జరుగుతున్నది నమ్మలేకపోయాడు. తనభార్య, తనశ్యామల తన్ను విడిచి వెళ్ళటమా ? ఎందుకు? తనేంచేశాడు! తనతో కాపరం చెయ్యటంకంటే, వీధుల్లో నిరాధరంగా తిరగటమే నయం, అనుకునేబాధ ఆమెకు తనేం కలిగించాడు? ఈ ఆలోచనలన్నీ అతని మనోవీధిలో ఒక్కసారి విరిసినై.

అప్రయత్నంగా "మళ్ళి ఎప్పుడొస్తావు శ్యామలా ?" అని అడిగాడు. అతని కంఠం వొణికింది. రుద్ధమయింది.

ఆ కంఠధ్వనికి రివ్వున వెనక్కు తిరిగింది శ్యామల. కోపంతో ఆమె ముఖం యెర్రబడింది. కట్టలు తెంచుకోటానికి ప్రయత్నిస్తున్న ఆమె ఉద్రేకంతో ఉక్కిరిబిక్కిరి అవుతూవుంది. హృదయం దడదడలాడింది.

నేను రాను. నా గొంతులో వూపిరి వుండగా మీ మొహం చూడను. అడుక్కొని అయినా బతుకుతాను చావనన్నా ఛస్తాను......" ఇక వాక్యం పూర్తి చెయ్యలేకపోయింది.

"ఎందుకు నేనేం చేశాను!" అన్నాడు గోపాలం ఆమె నిష్ఠురోక్తులనుంచి తప్పించుకోటానికి, మొహానికి చెయ్యి అడ్డంపెట్టుకొని అడిగాడు. అడగలేదు. తన్ను తానే తిట్టుకున్నాడు. తిట్టుకోవటం కాదు. తన్ను తానే శిక్షించుకున్నాడు.

శ్యామల అతని మానసికస్థితిని అర్థం చేసుకునే స్థితిలో లేదు. తోకతొక్కిన పాములా లేచింది. "ఇంకా ఏం చేశానంటున్నారా? నన్నింట్లో కట్టిపడేసి, దాసీదానికంటే కనాకష్టంగా చూస్తూ, రాత్రింబగళ్లు ఇష్టంవొచ్చినట్టు తిరిగి వొస్తూ...నే నేం మనిషిననుకున్నారా! పశువుననుకున్నారా? చీరెలూ జాకెట్లూ ఇన్ని నా మొహాన వేసి, రోజుకి యింత అన్నం వడ్డిస్తే చాలు అనుకున్నారా; ఇష్టం వొచ్చినట్టు ఆడవొచ్చు అనుకున్నారా! మీవంటి స్వార్థపరులకు, మోసగాళ్ళకు భార్యగా ఉన్నదానికంటే, నాలుగు ఇళ్ళల్లో అంట్లుతోముకొని బ్రతకటం మేలు" అన్నది.

శ్యామల ఇంత దీర్ఘంగా ఇంత ఉద్రేకంగా మాట్లాడినా గోపాలానికి అసలు సంగతి అర్థంకాలేదు. సంభ్రమాశ్చర్యా గుక్కతిప్పుకొని, "నీ కెందుకంత కోపం? నేనేంచేశానని? పోనీ, కారణం చెప్పు" అన్నాడు.

"పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగుతూ, ఎవ్వరూ తన్ను చూట్టంలేదు అనుకుంటుందట? ఈనాలుగు నెలల్నుంచీ మీ ప్రవర్తన నేను గమనించడంలేదు అనుకున్నారేం? — దాన్దేముంది మొద్దు, అంతగా అనుమానిస్తే 'ఒక జాకెట్టుగుడ్డ కొనిపెడితే అదే సంతోషిస్తుంది' అనుకున్నారే... ఈ నాలుగు నెలల్నుంచీ మీరు వొక్క పూట ఇంటికి వేళకు వచ్చారూ...రాత్రిళ్లు పన్నెండు గంటల ముందు ఎప్పుడన్నా వొచ్చారూ...?"

శ్యామల గుక్కతిరక్కుండా అతను చేసిన నేరాలు ఏకరువుపెడుతూవుంది. అతడు వినలేక ఇలా అన్నాడు. "నువ్వు లేనిపోనివన్నీ ఊహించుకొని బాధపడుతున్నావు. నాకు ఎన్నిపనులున్నవీ నీకు తెలుసు. కోడూరు గ్రామంలో వరదల వల్ల పంటలన్నీ నష్టపడ్డాయ్. బీదవాళ్లు తలదాచుకోటానికి ఇళ్లూ వాకిళ్లూ లేక, తింటానికి తిండిలేక అల్లాడిపోతున్నారు. వాళ్ళకోసం చందాలు పోగుచేస్తున్నారు. అది నీకు తెలిసివుండికూడా ఇల్లా అనుమానిస్తే నేనేం చెయ్యను. దేశసేవ చెయ్యటంకూడా తప్పే అయిపోయిందా? నువ్వు తెలిసినదానివి..."

మాయమాటలు చెప్పి, నన్నీ స్థితికి తీసుకు వొచ్చారు. దేశసేవ, చందాలు అని నన్ను నమ్మించి మీరు యశోదతో తిర గటం యెవ్వరికి తెలియదు..."

"శ్యామలా!" అని కోపంతో తన్ను తాను మరచిపోయి, రెం డ డు గు లు ముందుకు వేశాడు గోపాలం.

"మీరు చేస్తున్న పనులన్నీ నాకు తెలుసు. ఆ మాటా ఈ మాటా చెప్పి నన్ను ఇంటిలో పెట్టి, ఇష్టంవచ్చినట్లు తిరిగివచ్చి నాకు బూటకం మాటలు చెబు తున్నారు. నేను ఎంత తెలివితక్కువ దాన్నయితేమాత్రం, ఈమాత్రంతెలుసు కోలేను అనుకున్నారా? నన్ను వంటక త్తె కంటే కనాకష్టం చేశారు మీకు అహో రాత్రులు చాకిరీ జేస్తున్నందుకు కట్టుకో టానికి గుడ్డా, తింటానికి ఇన్ని మెతు కులూ వేస్తున్నారు. ఈ అవమానం నేను భరించలేను. మీ యశోదతో ఇక మీ ఇష్టంవొచ్చినట్లు ఊరేగండి. పార్కు-లూ, కాఫీహోటళ్లూ, మీ టిం గు లూ అన్నీ వెంటవేసుకొని తిప్పండి" అని పెట్టె తీసుకొని చరచరా వెళ్ళిపోయింది.

గోపాలం తల తిరిగింది నోట మాట లేదు. అలాగే చతికిలబడ్డాడు గతించిన తమ జీవితం ఒ క్క సా రి తలలో తిరిగింది.

వివాహానికి ముందునుంచీ తాను రాజ కీయాలలో ప ని చే స్తు న్నా డు. తమ మీద వెళ్ళినా, ఎంత ఆలస్యం అయినా తనకోసం కనిపెట్టుకు కూ ర్చు నే ది శ్యామల. బయట తన కెన్ని అభా భంగాలు కలిగినా, ఎన్నికష్టాలు వొచ్చినా ఇంటికొడ వున్నంత సేపూ శ్యామల పరిచర్యలవల్ల మనస్సు ప్రశాంతంగా ఉండేది. ఆమె తన భార్య అవటంవల్ల అనుకున్నాడు...

ఆమెను గృహానికి రాణిని చెయ్యా లనుకున్నాడు. గృహాన్ని అలంకరించటం మొదలుకొని కూరలు చెయ్యటం వరకు ఆమెకే విడిచిపెట్టాడు. ఏమీ జోక్యం కలిగించుకొనే వాడు కాదు. ఆమె యింటి విషయం ఏదన్నా అడిగితే, 'నీ యిష్టం, ఇంటి వి ష యా ల లో నీకు సర్వ స్వాతంత్ర్యం ఇచ్చాను' అన్నాడు. బైట విషయాలలో తను సర్వస్వతంత్రుడు. బయట విషయాలలో స్త్రీ జోక్యం కలి గించుకోవటం తప్పని అతని దృఢ విశ్వాసం. ఆ భేదం ప్రకృతి భేదం. ఇలా జరుగుతుండగా, ఒకనాడు తన బావమరిది వొచ్చాడు. అతడు మరొక రాజకీయపార్టీకి చెం ది న వా డు. తన కుటుంబ జీవితం చూచి ఇలా అన్నాడు :

"నీతోపాటు శ్యామలనుకూడా రాజ కీయాల్లో ప్రవేశపెట్టు బావా?"

అప్పుడు తన ఉద్దేశాలన్నీ బావ మరదితో చెప్పాడు.

పురుషుడితో పోటీ చెయ్యటం కాదు. జన్మతః స్త్రీకి పురుషుడికి భేదాలున్నాయి. తమ తమ స్వభావాలవల్ల పురుషుడు ప్రజాహిత జీవితానికి, స్త్రీ సంసార జీవితం సరిదిద్దటానికి అర్హులు. కాబట్టి స్త్రీ సంసార జీవితాన్ని, పురుషుడు ప్రజాహిత జీవితాన్ని నడపాలి. అటువంటి దాంపత్యమే ఆదర్శ దాంపత్యం అవుతుంది. లేకపోతే సామరస్యం వుండదు. భార్యాభర్తల మధ్య ద్వేషం ప్రబలిపోతుంది. జీవితం దుర్భరం అవుతుంది. స్త్రీకి జ్ఞానం సంపాదించాలని వుంటే, ఇంట్లోవుండే వార్తాపత్రికలు తెప్పించుకొని చదువుకోవచ్చు. అంతే గాని ప్రజోద్యమాల్లోకి స్త్రీ దిగడం మంచిది కాదు.

ఈ మాటలు విని తన బావమరది, "బావా ఈ నాటికి మీ జీవితం బాగానే వుంది. కాని క్రమేణా ప్రజోద్యమంలో పాల్గొంటున్న నీవు ఒక రకం సంస్కారాన్నీ, కుటుంబ జీవితానికి ముడిపెట్టుకొని కూర్చున్న శ్యామల మరొక సంస్కారాన్నీ అలవరచుకుంటారు. అప్పుడు సంఘర్షణ తప్పదు. మీజీవితం మామూలు స్త్రీ పురుషుల దాంపత్య జీవితాంకంటే అధోగతిపాలవుతుంది. నా మాట విను. నీ అనుభవంలోకి వచ్చే సాంఘిక జీవనం శ్యామలకు అందుబాటులో వుండేటట్లు చెయ్యి. లేకపోతే దగ్ధం చేసుకోవలసివొస్తుంది" అన్నాడు.

అప్పుడతని మాటలకు మనస్సులో నవ్వుకున్నాడు. తన బావమరది, స్త్రీ పురుష భేదం లేకుండా రాజకీయాల్లో అందరూ పాల్గొనాలి అని చెప్పే పార్టీకి చెందినవాడు అవటంవల్ల అలా చెబుతున్నాడు అనుకున్నాడు అలా ప్రవర్తించటంవల్ల ఆ పార్టీమీద మోపబడిన నిందలు, నేరాలూ అప్పుడే ఎలా మరచిపోయాడూ? అని ఆశ్చర్యపడ్డాడు. పాశ్చాత్య నాగరికతను అనుకరించి చెడిపోయారని తేల్చుకున్నాడు.

కాని తను జీవితాన్ని తిరగవేసి చూసుకుంటే తన బావమరది చెప్పినట్లే జరిగింది.

తాను ప్రజోద్యమంలోతిరగటంవల్ల, అనేక అనుభవాలు కలిగినై. అనేక రకాల వ్యక్తులతో పరిచయం ఏర్పడింది. అనేకభావాలు అనుభవంలోకి వొచ్చినై. పర్యవసానం దేశసేవే తనకు సర్వస్వం అయింది. తన సర్వస్వం దేశసేవకు ధారపొయ్యాలనే నిశ్చయం కలిగింది. విశాల హృదయం ఏర్పడింది. అటు కుటుంబజీవితపుహద్దులుదాటనిశ్యామలకు, రోజులు గడిచినకొద్దీ స్వభావం సంకుచితం అవటం మొదలుపెట్టింది. ఆమెకు కుటుంబమే సర్వస్వం. ఆ హద్దుల అవతల అంధకారం. తనకు తను తన భర్త; తమ సుఖమే సుఖం అయింది.



యువ

ఖర్చు పెడుతున్నాడని తన అయిష్టత తెలియజేసింది.

"దేశం కోసం" అన్నాడు తను. కాని ఆమెకు ఈ జవాబు ఏమాత్రం తృప్తినీ ఇవ్వలేదు. కుటుంబము సంగతి చూచుకోవాలన్నది. ముందు కుటుంబం, తరువాత దేశం అన్నది. రోజులు గడచినకొద్దీ ఆమె ఇంకా మారిపోయింది. నగలు చేయించమని అడగటం మొదలు పెట్టింది. మొండిచేతులతో, మొండి మెడతో ఉండలేకుండా వున్నానన్నది పదిమందీ నవ్వుతున్నారన్నది. అయ్యేది యెట్లాగూ సర్వమంగళం అవుతూంది; కట్నంకింద పెళ్ళినాడిచ్చిన పదిఎకరాలు తనపేర పెట్టమన్నది. అదైనా జీవనాధారం అవుతుంది అన్నది.

ఆమె మారుతుందనే ధైర్యంతో తను అన్నీ సహించాడు. తను మారతాడనే నమ్మకంతో ఆమె అతని పనులు కొంత వరకు సహించింది.

కాని ఎవరూ మారలేదు. కుటుంబంలో కీచులాటలు బయలుదేరినై. తను ఖర్చు పెట్టే ప్రతిరూపాయకు పేచీపెట్టటం మొదలుపెట్టింది. కష్టపెట్టటమే ఆమెకు ఆనందాన్నిచ్చేస్థితికి వొచ్చింది.

ఇప్పుడు పులిమీదపుట్ర. తనూ యశోదా కలిసి చందాలు పోగుచేస్తున్న మాట నిజమే; కలిసి పనిచేస్తున్నమాటా గురించి ఇంత నీచంగా ఆలోచిస్తుంది అని కలలోకూడా అనుకోలేదు. ఆమె మారింది. ఆమె జీవితం, ఆమె స్నేహాలూ, ఆమెను పూర్తిగా మార్చినై. ఇప్పుడేం చెయ్యాలి? తనేం చెప్పినా ఆమె నమ్మదు. స్త్రీ పురుష లిద్దరూ నిష్కల్మష హృదయాలతో కలిసి పనిచెయ్యటానికి వీలుందనే విషయం నమ్మటానికి అవసరమైన ఔదార్యం ఇప్పుడామెకు లేదు.

ఏం చెయ్యాలి? తనకూ తన శ్యామలకూ ఋణం తీరినట్లేనా? తను బ్రతికి నన్నాళ్ళూ ఈ కళంకాన్ని మోస్తూ బ్రతకవలసిందేనా?

అతనిలో తృటిలో ఇవన్నీ జ్ఞాపకం వొచ్చినై. దుఃఖంలో వివశుడయ్యాడు. వెంటనే తన బావమరది చెప్పినమాటలు జ్ఞాపకం వొచ్చినై. క్రమేణా ప్రజోద్యమములో పాల్గొంటున్న నీవు వొకరకం సంస్కారాన్ని అలవరచుకుంటావు... అప్పుడు సంఘర్షణ తప్పదు. మీ జీవితం మామూలు స్త్రీ పురుషుల జీవితాలకంటే అధోగతిపాలవుతుంది. నా మాట విను."

ఈ మాటలను జ్ఞాపకం తెచ్చుకొని తప్పంతా తనదే అనుకున్నాడు గోపాలం. కన్నీరు పెట్టుకుంటూ 'స్వయంకృతం' 'స్వయంకృతం' అనుకున్నాడు, గద్గదిక స్వరంతో.

— —



# తప్పటడుగు

పరిమళా సోమేశ్వర్

(గత సంచిక తరువాయి)

పాషాని చూడగానే మెహర్‌కి వళ్లు మండిపోయింది. "పాపం పెళ్ళి చేసుకుందామని వచ్చేడు కాబోలు!" అనుకుంది కసిగా.

పాషా వచ్చిన మర్నాడే మెహర్ రిజల్ట్సు వచ్చినయ్. సెకండ్‌క్లాసులో ప్యాసయింది. పాషా థర్డ్‌క్లాసులో ప్యాసయినట్లు పరీక్షలు వ్రాసిన కొద్దిరోజులకే అనధికారవర్గాల ద్వారా తెలుసుకున్నాడు.

పాషా వచ్చిన దగ్గరనుండి మళ్లీ రవీంద్ర రాకపోకలు తగ్గించేడు. పాషా రాకకి రవీంద్ర ప్రవర్తనకి యేమీ సంబంధం లేదని మెహర్‌కి తెలుసు. రవీంద్ర తను కోరుకున్న స్త్రీని పొందటానికి ఏలాటి వ్యక్తులను లెక్కచేయడు. ఎన్ని అవాంతరాలు వచ్చినా భయపడడు. ఆ సంగతి మెహర్‌కి బాగా తెలుసు.

అందుకే ఆమెకు భయంగా ఉంది. అతను మరల ఏ స్త్రీ సౌందర్యాన్ని ఆరాధించటంలో మునిగిపోయేడో నని ఆరాటపడసాగింది.

ఆ రోజు తనకి మాటిచ్చేడు. ఇకముందు ఎప్పుడూ పరస్త్రీల జోలికి పోనన్నాడు. తను తప్ప ప్రపంచంలో మరే స్త్రీకూడా అతని సౌందర్య పిపాసను చాల్లార్చలేదన్నాడు. తన దేహంలోని అణువణువూ అతనిలో లీనమైపోవా



# ప్రతివారికి రక్షణ కావాలి




ఈ రక్షణ బాక్టీరియానుండి
చెమటవాసన నుండి—
మీరు, ఇతరులు సంకోచ
పడే అవస్థనుండి—
జి-11 తో కూడిన
సింథాల్ టాయిలెట్ పౌడరు
మీకీ రక్షణలన్నీ ఇస్తుంది,
ఇవేకాదు-సువాసన...
సుమసుగంధము,

**సింథాల్—**
**దుర్గంధముల నుండి**
**సంపూర్ణ రక్షణనిచ్చు**
**టాయిలెట్ పౌడరు**

Interpub/G... R Tel

ఆరస్తుందను

అన్నాడు. అన్ని మాటలు చెప్పిన తను మరల తనని మోసంచేస్తాడా? మోసం చెయ్యగలడా? రవీంద్ర శీలవంతుడు కాక పోవచ్చు. కాని అది తప్పే మనిషి కాడని తన అంతరాత్మ చెప్తోంది.

ఒకటికి నాలుగుసార్లు రవీంద్రకు ఫోన్ చేసింది. ఎప్పుడు ఫోన్ చేసినా రవీంద్ర యింట్లో లేడనే సమాధానం. ఓ రోజు హాస్పిటల్‌కి కూడా ఫోన్ చేసింది. తీరాచూస్తే అతను సిక్‌లీవ్ మీద ఉన్నట్లు చెప్పేరు వాళ్లు.

సిక్‌లీవ్‌మీద ఉన్న మనిషి యింట్లో లేడంటే దాని అర్థం యేమిటి?

మెహర్‌కి ఉద్రేకంతో ఊపిరాడలేదు ఆమె మనసులో అనుమానం, అసూయ, ద్వేషం, ప్రతీకారం ఒక్కొక్కటిగా పాముపిల్లలవలె చోటు చేసుకోసాగినయ్.

ఏమైనా సరే! ఈ దెబ్బతో అటో ఇటో తేలిపోవాలి. రవీంద్రకీ తనకీగల సంబంధ మేమిటో యీ తడవతో నిశ్చ యించుకోవాలి! అని గట్టిగా తీర్మానించు కుంది మెహర్.

## 14

చాలా రోజుల తరువాత సినిమా హాలులో కనిపించేడు రవీంద్ర. భార్య తోనూ, పిల్లలతోనూ కలిసి హిందీ సినిమాకి వచ్చిన రవీంద్ర మెహర్‌ని, ఇంటర్వెల్‌లో చూసి యిబ్బందిగా నవ్వేడు.

ఆ సమయంలో అతని ప్రక్కన లక్ష్మికాక మరే స్త్రీ ఉన్నా మెహర్ అతనిని పట్టుకుని దులిపేదే! లక్ష్మిముఖం చూసేక అతనితో మామూలుగా మాట్లా డటానికి కూడా మనసొప్పలేదు మెహర్‌కి.

లక్ష్మి మాత్రం ముఖం చేటంత చేసుకుని పలకరించింది మెహర్‌ని. "ఈ మధ్య మా యింటికి రావడంలేదే?" అనడిగింది.

రవీంద్ర అందరికీ కూల్‌డ్రింక్స్ తెప్పించేడు. ఆ డ్రింక్ సీసాను తీసు కుని అతని ముఖాన గిరాటు వెయ్యా లన్నంత కోపంగా ఉందామెకు.

"డాక్టర్‌సాబ్, మాయింటి ఛాయలకే రావటం లేదు" అంది లక్ష్మితో.

"ఆయన్ని గురించి నీకు తెలియని దేముంది? అన్నట్లు యీ మధ్య పెయింటింగ్సు వేయటంలో కూడా మునిగి పోయేరు. ఇంట్లో ఉన్నంత సేపూ ఆగది వదిలి బయటకు రావటంలేదు"

"మోడల్ యీ సారి ఎవరో!" ఆమె వాక్యంలోని వ్యంగ్యం లక్ష్మికర్థం కాకపోయినా, రవీంద్రకు బాగానే అర్థమ యింది. అందువల్ల ముఖం చిట్లించు కుని కూర్చున్నాడు. అతనికి మెహర్ ధోరణి ఏ మాత్రం నచ్చలేదు. పైగా

యువ

ఆమెతోటి సాహచర్యం, తీపిని అతిగా తింటే కలిగే వెగటును పుట్టిస్తోందిఅతనికి. అందుకే ఆమెకు సాధ్యమైనంత దూరంగా ఉండదల్చుకున్నాడు.

"ఆ అమ్మాయి పేరేమిటో మర్చిపోయేను. ఎవరండీ ఆ పిల్ల?" అంటూ భర్తవైపుకు తిరిగి అడిగింది లక్ష్మి.

రవీంద్ర ఆమె మాటలు విననట్లే నటించి పిల్లకు డ్రింక్స్ తాగిస్తున్నాడు.

మెహర్ అది గ్రహించి విషపూరితంగా నవ్వుకుంది.

మెహర్ ఎదురుచూడక పోయినా మర్నాడు సాయంత్రం నాలుగు గంటలకు వచ్చేడు రవీంద్ర.

అతనిని చూస్తూనే ముఖం మాడ్చుకుంది మెహర్,

"రాణీగారు అలిగినట్లున్నారు" అన్నాడు రవీంద్ర.

"మా అలకతో మీకేం అవసరం?"

"మీ అలకతో అవసరం లేకపోయినా మీతో అవసరం ఉంది" అంటూ వచ్చి ఆమె ఒడిలో తలపెట్టుకుని పడుకున్నాడు. మెహర్‌కి కన్నీరాగలేదు.

టపటప మంటూ తన ముఖంమీద రాలిన కన్నీటిబొట్లను చూసి తలెత్తాడు రవీంద్ర.

"అబ్బ—మళ్ళీ ఏడుపా?" అన్నాడు చిరాగ్గా.

ఔను. మితి స్నేహం చేసినందుకు నాకు మిగిలింది యీ కన్నీరే!"

"ఛ! వెధవ డైలాగులూ నువ్వూను. ఇలా మాటిమాటికీ ఏడ్చేవంటే నీ దగ్గరకు రాను ఇదే ఆఖరుసారి. తెలిసిందా?" అన్నాడు కోపంగా.

"ఔను. మీరు అంతకన్న యేం చెయ్యగలరు? మీరు మనుషులను అసత్యాలతోను. బెదిరింపులతోనూ మాత్రమే లొంగతీసుకోగలరు. అనురాగం, ప్రేమ అనేవి మీవంటి చంచల హృదయులకేం తెలుస్తుంది?" అన్నది విరక్తిగా.

"నన్ననవసరంగా రెచ్చకొట్టకు మెహర్. చెప్తున్నాను. ఇప్పుడు కనుక నేను వెళ్ళిపోయేనంటే మళ్ళీ ఈజన్మలో నీ మొహం చూడను."

"ఐతే తక్షణమే వెళ్ళిపొండి. నా కళ్ళముందు నుండి పొండి" అంటూ అతని జుట్టు గట్టిగా పట్టుకొని అతనిని లేవదీసింది.

రవీంద్ర చివ్వున లేచికూర్చున్నాడు.

"ఛీ! దుర్మార్గురాలా!" అన్నాడు ఎఱ్ఱబెక్కిన కళ్ళతో.

"నేనుకాదు దుర్మార్గురాలిని. నువ్వే దుర్మార్గుడివి..." రోషంగా అంది మెహర్

"నిన్ను...నిన్ను... యేం చేసినా పాపంలేదు. నీలాంటి కులటతో సంపర్కం పెట్టుకోవటం నాదే బుద్ధి తక్కువ. ఛూ"

రాస్కెల్! నా ర్కుడు!" అంటూ రక్తనాళాలు బ్రద్దలయ్యేలా అరచింది మెహర్. హు "నేను కులటనా? అనరా! అను. నీకు లొంగిపోయిన ఆడది నీకు లోకువ కాదూ? ఔను. నీలాటి చరిత్ర హీనుడి సంపర్కాన్ని కోరి తెచ్చుకున్న నేను, కులటనుకాక పతివ్రత నెలా అవుతానురా? నా వయస్సును, భవిష్యత్తును అన్నిటినీ విస్మరించి, బంగారంలాంటి నా జీవితాన్ని నీకోసం నాశనంచేసుకున్నాను. నీనుండి లభించిన ప్రతిఫలం కులట అన్న పదమేరా! ఔరా దౌర్భాగ్యుడా! స్త్రీలోని దేహాన్ని దాటి చూడలేని నీవంటి కాముకుడికి కులటకీ, పతివ్రతకీ తేడా యేంతెలుస్తుందిరా? స్త్రీలో శారీరక సౌందర్యాన్ని చూసి మెచ్చుకోవటం తప్ప, అంతరంగపు అందాన్ని చూడలేని నీలాటి నీచుడిని, మాటలతో మార్చగల ననుకోవటం నా దీ బుద్ధి తక్కువ. ఫో! ఇంక నా ఎదుట ఒక్క క్షణంకూడా నిల్చోకు. వెళ్లు" అంది మెహర్.

రవీంద్రకి కోపోద్రేకాలతో నోటి వెంబడి మాటలు రావటంలేదు. చాలా సేపటివరకు తలవంచుకుని కుర్చీలోనే కూర్చున్నాడు.

అతనలా మౌనంగా కూర్చునే సరికి, క్రమంగా ఆమె ఆవేశంకూడా చల్లారసాగింది. అప్పటి అతని మూర్తి ఎంతో దయనీయంగా కనిపించిం దామెకంటికి.

"రవీంద్రా! నన్ను క్షమించు. కోపంలో ఏమేమో అన్నాను." అంటూ అతని తలను తన గుండెకానించుకొని చెప్పాలనిపించిం దామెకు.

కాని ఆమె అలా అనుకుంటూ ఉండగానే అతను చటుక్కున లేచి, మాట మాత్రమైనా చెప్పకుండా వెళ్లిపోయేడు.

ఆమెలో నిరాశా నిస్పృహలతోపాటు, ఉక్రోషం, ద్వేషం కూడా కలిగినవి.

"పోనీ! నేనే అతనికోసం అంతగా పడిచస్తున్నాననుకుంటున్నాడు కాబోలు!" అనుకుంది.

ఇంతలో రహీం వచ్చేదక్కడకు. "ఆంటీ! డాక్టరుసాబ్ అప్పుడే వెళ్లిపోతున్నారే?" అన్నాడు. వాడికి అప్పుడే స్పష్టంగా మాట్లాడటం వస్తోంది. డాక్టర్ సాబ్‌కీ, మేనత్తకీ యేదో సన్నిహిత పరిచయముందని ఆ పసిమనసుకి కూడా తెలిసింది.

"ఔను బాబూ! మళ్లీ రేపు వస్తానని వెళ్లిపోయేరు." అంది.

"నువ్వెందు కేడుస్తున్నావు ఆంటీ? డాక్టరుసాబ్ కొట్టేడా?" అన్నాడు రహీం.

అప్పటికిగాని తెలియలేదు మెహర్‌కి, తన బుగ్గలమీద కన్నీటి చారికలున్నట్లు, తన కళ్లలోని తడి యింకా ఆరిపోనట్లు.

"లేదు బాబూ! నాకు జ్వరంవచ్చింది. పళ్లు నొప్పిగా ఉంది. అందు కేడుస్తున్నాను."

అయిందీ యిప్పు డర్థమవుతోంది. ఆ సంగతి తనకు మోహపు కైపులో ఉన్నపుడు తెలియలేదు. ఇప్పుడా కైపు దిగిపోయినాక, తను ఆ విషయాన్ని గ్రహించినా లాభం యేమీ లేకపోయింది. అంతా చెయ్యి జారిపోయింది. సర్వమూ నాశనమయింది.

మళ్లీ ఒకసారి ఖురానులోని వాక్యం గుర్తుకొచ్చింది మెహర్‌కి. భగవంతుడు ప్రతి మనిషికీ జీవితంలో ఒకే ఒక్క క్షణాన్ని అతని స్వయం నిర్ణయానికి వదిలివేస్తాడట ఆ క్షణాన్ని ఉపయోగపర్చుకునే విధంమీదనే, అతని భావి జీవితం ఆధారపడి ఉంటుందట.

ఔను. ఆ వాక్యాలలో ఎంత నిజముంది! పొరపాటున హాస్పిటల్‌లో ఉండగా రవీంద్ర ఆకర్షణకి తన మనసు లొంగిపోయినా, కనీసం అతడు వివాహితుడనీ, అతనిని వివాహమాడి జీవితాంతం అతనితో గడిపే అవకాశం తనకి లేదని తెలిసిన తరువాతనైనా తాను అతనినిదూరం చేసుకున్నట్లయితే, యీనాడు తానింత క్షోభను పొందవలసి వచ్చేది కాదు. భగవంతు డిచ్చిన ఒకే ఒక అమూల్యమైన క్షణాన్ని తను దుర్వినియోగ పరచుకుంది.

తను తప్పటడుగు వేసింది. ఆ క్షణంలో జారిన కాలుని తాను మళ్లీ వెనక్కి తీసుకోలేకపోయింది. అందుకే జారినా తిరిగి దానిని తీసుకోలేమని.

జీవితంలో తెలిసికాని, తెలియకగాని తప్పటడుగు వేస్తే, యింక సరాసరి పాతాళలోకంలోకే ప్రయాణం. బహుశా తెలియక తప్పటడుగు వేస్తే, సంఘం క్షమించక పోయినా కనీసం అలాటి వ్యక్తులను భగవంతుడన్నా క్షమిస్తాడు. కాని తెలిసి తెలిసి, తనలా తప్పటడుగు వేసే మనిషిని భగవంతుడు కూడా క్షమించలేడు.

రవీంద్ర పూర్వోత్తరాలు తెలియక అతనికి లొంగిపోయిందంటే కొంత అర్థముంది. అతను వివాహితుడనీ, నీతి దూరుడనీ తెలిసికూడా అతనితో శారీరక సంపర్కాన్ని కోరుకుంది. అది చాలక అతను తననేదో ప్రేమించాలనీ, పూర్తిగా తనకే అంకితమైపోవాలనీ పేరాశగా ప్రవర్తించింది.

ఫలితం కన్నీళ్లు, అవమానం.

ఈ కన్నీళ్లకు ఏదో విధంగా స్వస్తి చెప్పాలి.

ఈ అవమానానికి ఎలాగైనా ప్రతీకారం చెయ్యాలి. కాని ఎలా? ఎలా?

మెహర్ మెదడులో పిశాచాలు ప్రవేశించినవు. ఆమె శరీరంలో పాశవిక శక్తులు చోటు చేసుకోసాగినవు.

నిర్మలంగా చూసే ఆమె కళ్లలో క్రౌర్యరేఖలు కదలాడసాగినవు.

తీయని తలపులతోనిండిన ఆమె పెద

నడు.

ప్రతీకారవాంఛ ఆమె సహజ ప్రకృతినే మార్చివేసింది.

ఆమెలోని స్త్రీ సహజమైన సహనం, మార్దవం అన్నీ ఆ ప్రతీకార వాంఛ మాటున అణగారిపోయినవు.

ఆమె అలాటిస్థితిలో ఉండగానే ఒక రోజు రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతంలో రవీంద్ర ఆమె గదిలోకి ప్రవేశించాడు. తలుపు గడియపెట్టి ఎఱ్ఱబారిన కళ్ళలో తీవ్రమైన కాంక్ష కదలాడుతుండగా అతను తనని సమీపిస్తుండేసరికి, మెహర్‌కి ఒక్కసారిగా ఏమనాలో తోచ లేదు.

అతని ముఖంతీరుచూస్తుంటే అతను తప్పతాగినట్లు తెలుస్తూనే ఉంది. అలాటి సమయంలో అతనితో వాదనకు దిగటం వల్ల ప్రయోజనం యేమీ లేదని ఆమెకు తెలుసు.

పైగా తను రాద్ధాంతంచేస్తే యింట్లో అందరికీ తెలిసిపోతుంది.

ఇటీవల మామూలు స్థితిలోఉన్నప్పుడు రవీంద్ర మెహర్‌ని అసహ్యించుకుంటున్నాడు. ఆమె ఛాయలకి వెళ్ళటానికే భయంగా ఉంటోంది.

కాని త్రాగిన మైకంలోఉన్న అతని మెదడులో ఆమెయొక్క సౌందర్యరేఖ లన్నీ మసకగా కదలాడేసరికి, యిక నిగ్రహించుకోలేక వచ్చేడు.

వాటేసుకున్నాడు రవీంద్ర.

మెహర్‌కి అతని స్పర్శ మరింత క్రోధాన్నీ, జుగుప్సనీ కలిగించింది. "ఛీ! మీ కెప్పుడూ నా శరీరమేకావాలి. నా మనసుని గురించి ఆలోచించనే ఆలోచించరు." అన్నది కోపంగా.

రవీంద్ర భయంకరంగా నవ్వేడు. "ఆడదానికి శరీరం, మనసూ రెండూ ఒకటేనోయ్. శరీరాన్ని లొంగదీసుకున్నామంటే, మనసు కూడా దానంతట అదే లొంగిపోతుంది" అన్నాడు, ఆమెను క్రూరంగా నలిపివేస్తూ.

అంతబాధలోనూ ఆమెను అతని మాటలు ఆలోచింపజేసినవు. ఔను. సరిగ్గా యివే మాటలు ఒకప్పుడు పాషా కూడా అన్నాడు. ఆ వాక్యాల్లో ఎంత నిజమున్నదో యిప్పు డర్థమవుతోంది. స్త్రీ తన శరీరాన్ని ఎవరికి అర్పిస్తుందో ఆ పురుషుడిని ప్రేమించకుండా ఎన్నడూ ఉండలేదు స్త్రీకి శరీరము-మనసు వేరు కాదు. అవి రెండూ ఒకటే! ఒకదానిని లొంగదీసుకుంటే రెండవదానిని లొంగ దీసుకోవటం చాలా సులభం.

ఆనాడు తోటలో పాషా తనని బలాత్కారంగా పొంది, తనని పెళ్ళి చేసుకున్నట్లయితే యీనాడిలా అసహ్యించుకుంటూ కూడా రవీంద్రకు శరీరాన్నర్పించవలసినస్థితి కలిగేదికాదు

పాషా చెయ్యవలసిన పనిని రవీంద్ర

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి, సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్: 76600




బ్రాంచీలు:

| | | |
|---|---|---|
| హెడ్ ఆఫీసు: | 4-1-881/7, తిలక్ రోడ్ | ఫోన్ 42586 |
| | 15-9-311, అఫ్జల్‌గంజ్ | ఫోన్ 42629 |
| 86, సరోజినీ దేవి రోడ్ | 16-6-68, చాదర్‌ఘాట్ | ఫోన్ 52400 |
| రాజ్‌మహల్ హోటల్ ఎదురుగా | ఆంధ్ర బ్యాంక్ ఎదురుగా, విద్యానగర్ | ఫోన్ 35419 |
| సికింద్రాబాదు. | సత్యా టాకీస్ వద్ద, ఆల్వాల్ | ఫోన్ 79009 |
| | గోల్డు స్పాట్ వద్ద, అమీర్ పేట | ఫోన్ 32901 |
| | భారత్ హెవీఎలెక్ట్రికల్స్ రామచంద్రపురం | |

సింది. అయినా తాను మాత్రం తన మనసునికూడా రవీంద్రకి యిచ్చివేసింది.

రవీంద్ర ఆ మనసును నిర్లక్ష్యంచేసి, తన శరీరంతో తృప్తి పడుతున్నాడు అనుకుంది.

ఆమె శరీరం మల్లెపూవులా అతని చేతుల్లో నలిగిపోతుంటే మెహర్ వెక్కి వెక్కి ఏడ్చింది. "రవీంద్రా! ఎప్పుడూ యిలాగే నాకు యింత దగ్గరగా ఉండి పోరాదూ? నా శరీరానికి వచ్చినంత సన్నిహితంగా నా మనసులోకి కూడా రావటానికి ఎందుకు ప్రయత్నించవు?" అన్నది, అతని తలను తన గుండెకు గట్టిగా అదుముకుంటూ.

స్కాచ్ విస్కీ మైకంలో ఉన్న రవీంద్ర చెవులకు ఆమె మాటలు లీలగా వినిపించినయ్.

కాని ఆ వాక్యాలు అతని మనసుని మాత్రం స్పృశించలేకపోయినయ్.

తెల్లవారేక కళ్లు తెరిచిన మెహర్ గాట్లుపడిన తన బుగ్గలను, బరువుగా ఉన్న తన శరీరాన్ని చూసుకొని విచారంగా నవ్వుకుంది.

ఈ అనుభవానికి సంతోషపడాలో, దుఃఖించాలో కూడా ఆమె కర్థంకావటం లేదు.

కాని ఎంతైనా ఆమె శరీరం కొన్ని గంటలపాటు అతనికి లొంగిపోవడంవల్ల కొంచెం మెత్తదనం కలిగింది.

రవీంద్రకు మెల్లగా నచ్చచెప్పి ఎలాగైనా అతని తిరుగుళ్లను తగ్గించాలనుకుంది. ఏమైనా సరే రవీంద్రను జారవిడుచుకోకూడదు అని నిశ్చయించుకుంది. రాత్రి అనుభవాలను మత్తుగా నెమరువేసుకుంటూ.

ఆమె గదిబయటకు వచ్చే సరికి బారెడు ప్రొద్దెక్కింది.

సీటుగా ముస్తాబై ఉన్న రహీం ఆమె దగ్గరకు పరుగెత్తుకు వచ్చేడు. "ఆంటీ! ఆంటీ! ఇవ్వాళ నేను డాడీతో కలసి షాప్‌కి వెళ్తున్నాను." అన్నాడు

"ఎందుకు?" అనడిగింది అతని బుగ్గలను నిమురుతూ.

"ఏం లేదు. ఊరికే వెళ్తున్నాను. డాడీ నాస్తా చెయ్యగానే తనతోపాటు షాపుకి తీసుకు వెళ్తానన్నాడు. అక్కడ షాపులో కూర్చుంటే డబుల్‌డెక్కర్ బస్సులు, లారీలు, రిక్షాలు, కారులు ఎన్నో కనపడతయ్‌ట. ఎంతో బాగుంటుంది. నువ్వు కూడా రారాదూ?" అన్నాడు రహీం.

"నేను మళ్ళీ యింకోసారి వస్తాన్లే. ఈ రోజు నువ్వెళ్ళు" అంది మెహర్.

"సరే, టాటా! వచ్చేటప్పుడు నీకు చాక్లెట్లు కొనుక్కొస్తాన్లే. టాటా! టాటా!" అంటూ తుర్రున బయటకు పరుగెత్తాడు రహీం.

# ...ఇంక ఇప్పుడు!




## ఈ తలనొప్పి మాత్ర మాత్రమే కలిగి ఉంది
## హెచ్చు శక్తి + రక్షణ

హెచ్చు శక్తి ఎందుకంటె, అవేదన్ ప్లస్‌లో బాధను తొలగించే అదనపు పదార్థములు ఉన్నాయి. అది త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా, ఉపశమనమును కలిగిస్తుంది

రక్షణ ఎందుకంటె, అవేదన్ ప్లస్‌లో చాల కాలము వాడినా హానికరమైన చెడు ఫలితములను కలిగించే పదార్థములు ఏవీ లేవు.

Shilpi HPMA 2C/72 Tel

**తలనొప్పి, జలుబు, ఫ్లూ, ఒంటి నొప్పి, పంటి నొప్పి మరియు బహిష్టు రోజులలో అవేదన్ ప్లస్‌ను వేసుకోండి.**

మోతాదు : ఒకే ఒక బిళ్ల చాలును (నొప్పి తీవ్రముగా ఉంటే రెండు బిళ్లలు వేసుకోండి).
20 బిళ్లల కుటుంబ ప్యాకులో కూడ లభిస్తోంది.

SQUIBB®
SARABHAI CHEMICALS

avedan® plus

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం. దీని లైసెన్సుడు ఉపయోగదారులు కరంచంద్ ప్రేమచంద్ ప్రైవేట్ లిమిటెడ్

వైపుకు నడిచింది.

ఆ రోజు ఎందుకో ఆమె మనశ్శరీరాలు రెండూ గాలిలో తేలిపోతున్నట్లుగా ఉన్నయ్.

ఇటీవల ఎన్నడూలేని ప్రశాంతత హఠాత్తుగా ఆమె నావరించుకుంది.

ఆ రోజు తలారా స్నానంచేసింది మెహర్. అసలే రాగిరంగులో ఉండే ఆమె తలవెంట్రుకలు మరింత ఎర్రగా మెరిసిపోయినయ్.

తెల్లని పైజామా వేసుకొని, దానిమీద తెల్లని చుక్కలున్న నల్లకుర్తా వేసుకుంది. తెల్లని జార్జెట్ పల్లూని మెడను చుట్టివేసేలా వేసుకుంది.

క్రితంరోజే అహమ్మద్ ఎమ్మెస్సీ అప్లికేషన్‌ఫారం తెప్పించి ఆమెకిచ్చేడు.

స్నానంచేసి ఫారం పూర్తిచేసింది. ఆమెకు బోటనీలో ఎక్కువ మార్కులు రావటంవల్ల ఎమ్మెస్సీ బోటనీతో చేద్దామనుకున్నది మెహర్.

ఆ ఫారంలో ఒకచోట గెజిటెడ్ ఆఫీసర్ సంతకం కావలసి వచ్చింది. ఆ సాయంత్రం రవీంద్రని పిలిపించి సంతకం చేయించుకుందా మనుకుంది.

మర్నాడే ఫారం యూనివర్సిటీలో యిచ్చివేయాలి.

ఫారం పూర్తిచేయటం అవగానే మడిచి డ్రాయర్‌లో పెడుతుండగా పాషా వచ్చే దక్కడకు.

ఎదురుచూడని అతని ఆగమనానికి తబ్బిబ్బయింది మెహర్. కాని ఒక్కసారి ముఖాముఖి అతనిని కలుసుకుని ఎలాగైనా అతనితో తన నిశ్చయాన్ని చెప్పాలనుకోవటంవల్ల ఆమె వెంటనే అతనితో మాట్లాడటానికి సిద్ధంగా ఉన్నట్లు అతనివంక ధైర్యంగా చూసింది.

"మెహర్! నేను నీతో ఏం మాట్లాడదల్చుకున్నానో నీకు తెలుసనుకుంటాను." అన్నాడు, ఉపోద్ఘాతాలేవీ లేకుండానే పాషా.

"తెలుసు." ఆమె కూడా సూటిగానే సమాధానమిచ్చింది.

"ఐతే నీకు నన్ను పెళ్ళి చేసుకోవటం ఇష్టమా, కాదా చెప్పు?"

"నా కిష్టం లేదు."

"ఎందు కిష్టంలేదు?"

"అదంతా నీ కనవసరం"

"ఆ డబ్టరు జీవితాంతం నీతోనే ఉంటాడనుకుంటున్నావా?"

"ఆ విషయాలన్నీ నీ కనవసరం"

"ఇప్పటికే ఆ డాక్టర్‌కి నీ మీద మోహం మెత్తిపోయింది. ఇంకా ఎన్నో రోజులు నీ అందంతో అతనిని ఆకట్టుకోలేవు. కేవలం శారీరక సౌందర్యంతో ఒక పురుషుడిని కలకాలం నువ్వు బంధించలేవు. మరికొన్ని రోజులుపోతే రవీంద్ర నీ ముఖం కూడా చూడడు. అప్పుడు నీ గతేం కావాలి?"

రవీంద్రను గురించి ఎలాటి భయసందేహాలున్నాయో, వాటినే పాషానోటివెంట వినేసరికి మెహర్ రెచ్చిపోయింది.

తను రవీంద్రయొక్క ప్రేమను గురించి సందేహిస్తున్నమాట నిజమే! కాని ఆవిషయమే మరోవ్యక్తి అందునా పాషా హెచ్చరికచేయటంతో ఆమె అభిమానం గాయపడింది.

"నా వ్యక్తిగత విషయాలలో జోక్యం కలిగించుకోవద్దని నీకు చాలా సార్లు చెప్పేను. ఇప్పుడు కూడా చెప్తున్నాను. దయచేసి, నన్ను విసిగించక వెళ్ళిపో" అంది అసహనంగా మెహర్.

"మరోసారి ఆలోచించికో మెహర్, నువ్వు శీలంలేని స్త్రీవని తెలిసీ నేను కాబట్టి పెళ్ళిచేసుకోవటానికి సిద్ధంగా ఉన్నాను. మరోపురుషుడు నీసంగతి తెలిస్తే నీఛాయలకుకూడా రాడు. అవినీతి ఎన్నాళ్ళో దాగదు. ఎప్పుడో ఒకప్పుడు నీసంగతి నలుగురికీ తెలియకపోదు. అలా తెలిసిననాడు జన్మలో నీకు పెళ్ళి జరగటం కల్ల. మనిద్దరికీ రక్త సంబంధంఉంది. పైగా చిన్నతనంనుండీ నీ మీద అభిమానం కలవాడిని. అందుకే చెప్తున్నాను. నా మాటవిని ఆ రవీంద్రను మర్చిపో! ఇప్పటికైనా నిన్ను క్షమించడానికి సిద్ధంగాఉన్నాను నేను"

మెహర్ అతనివంక అసహ్యంగా చూసింది. "సిగ్గులేదూ అలా మాట్లాడటానికి? అవినీతిట! అవినీతి! నువ్వెంత నీతిమంతుడివో నాకు తెలియదా? మగవాడు అవినీతిపరుడైనా అతను పెళ్ళికి అర్హుడు! ఆడదిమాత్రంకాదా? ఐనా 'నీతి' అని ముసుగుని కప్పుకుని పెళ్ళికోసం నేనేమీ పడిచావటంలేదులే. నీకబుర్లన్నీ ఏపతివ్రతకైనా చెప్పి ఆమె నుద్ధరించు. చిన్నతనం నుండి నాస్వభావం నీకు బాగా తెలుసు. నేను కోరుకున్నది యేదైనాసరే పొందటమే నాఉద్దేశం. అలాగే నా కిష్టంలేని పనిని నాచేత భగవంతుడు కూడా చేయించలేడు. తప్పో, ఒప్పో రవీంద్రకు నే నంకితం అయిపోయేను. జీవించినా నాబ్రతుకు అతని బ్రతుకుతోనే ముడివడిపోయిఉంటుంది. ఇంక నువ్వు ప్రయాసపడక వెళ్ళి ఏకోటీశ్వరుడి కూతురినో చేసుకుని సుఖపడు. సెలవ్" అంటూ చరచర గదిలోనుండి బయటకు వచ్చేసింది.

తరువాత ఓగంటకు పాషా బట్టలవీ సర్దుకుంటున్నట్లు, రాత్రి ఎనిమిదిగంటల రైలుకేప్రయాణమవుతున్నట్లు తెలిసింది మెహర్‌కి. అంతటితో పాషా తన జీవితంనుండి కూడా నిష్క్రమిస్తాడని తెలుసుకుని తృప్తిపడింది మెహర్.

మధ్యాహ్నం పన్నెండు గంట లయింది. అప్పుడే భోజనంచేసి గదిలో కూర్చుంది మెహర్.

ఆమె మనసంతా చికాగ్గాఉంది. రవీంద్ర ఆరోజు తనతో పోట్లాడి

# మాంసకృత్తుల లోపం వలన జుట్టు ఊడుటకు దారి తీస్తుంది



**ప్యూర్ సిల్వీక్రిన్ 17 అత్యవసరమైన మాంస కృత్తుల అనుబంధములు కలిగియున్నది...జుట్టు మొదళ్ళకు అత్యవసర పోషణ కలుగజేసి జుట్టు ఊడిపోకుండ సహాయపడునని నోబుల్ ప్రైజ్ టెక్నిక్‌చే నిరూపించబడినది.**



**ప్యూర్ సిల్వీక్రిన్ ఊడిపోయే జుట్టును అరికట్టుటకు నిరూపణ**

1. జుట్టు మొదళ్ళలో ప్రధానమైన ఎమినో-ఏసిడ్‌ల కొరత వలన జుట్టు పెరుగుదల పలుచబడి, అనారోగ్యవంతముగా ఉండును. ఈ పరిస్థితి అరికట్టక పోతే, జుట్టు పలుచబడి, ఊడిపోవుటకు దారి తీయగలదు

2. ప్యూర్ సిల్వీక్రిన్ (మేగ్నిఫైడ్) ప్రతిబంధవు 17 ఎమినో-ఏసిడ్‌ల రూపంలో ప్రకృతి సిద్ధమైన మాంస కృత్తులు గలిగి అత్యవసర, ఆరోగ్యమైన జుట్టు పెరుగుదలకు ఉపకరిస్తుంది. ప్యూర్ సిల్వీక్రిన్ త్వరితంగా జుట్టు మొదళ్ళ లోనికి చొచ్చుకొని పోవును.

3. నోబుల్ బహుమతి విజయ పరిశోధన వలన ప్యూర్ సిల్వీక్రిన్ రోపించిన మాంస కృత్తులను భర్తీ చేసి మరల మీ జుట్టు దట్టంగా పెంచి, ఆరోగ్యకరంగా వుండునట్లు చేస్తుంది.

**నేడే ప్యూర్ సిల్వీక్రిన్ వాడుటకు ఆరంభించండి.**

మంచి ఫలితాన్ని పొందటానికి ప్యూర్ సిల్వీక్రిన్ క్రమంగా వాడండి. ప్యూర్ సిల్వీక్రిన్ ప్రతి రోజూ రోజుకు రెండు సార్లు తలకు మర్దించండి. మీ జుట్టు పెరుగుట ఆరోగ్యవంతముగా వుండుట కనుగొనగలరు. కొద్ది కాలంలోనే, విచిత్రమైన ప్యూర్ సిల్వీక్రిన్ వాడకం మీ జుట్టు ఇదివరకటి ఆరోగ్యాన్ని చేకూర్చి దట్టంగా పెరుగుదల నిస్తుంది.




# ప్యూర్ సిల్వీక్రిన్

## వాడుట ఆరంభించండి

mcm/s/7 81

వచ్చి తనని రెచ్చగొట్టి మరీపోయేడు. రాత్రి అతను రావడంవల్ల తనకు తన శరీరంమీద వ్యామోహం పెరగటమే కాక అతనిని తన వైపుకు మళ్ళించు కోవాలన్న పేరాశకూడా అధికమయింది. ఎలాగైనా రవీంద్ర తనకి కావాలి, తనకే కావాలి. పూర్తిగా తనకే కావాలి, దాని కోసం ఏమైనా చెయ్యాలి అనుకుంది మెహర్.

గది బయటకు వచ్చి యిల్లంతా అసహనంగా తిరిగింది. తండ్రి భోజ నానికని డైనింగ్ రూముకి వెళ్ళినట్లు న్నాడు. అతని గది ఖాళీగా ఉంది. బాబా గదిలోకి వచ్చి చాలారోజులయింది. అసలు రవీంద్రతో పరిచయమైన దగ్గర నుండి ఆమె మనసు మనసులో ఉండటం లేదు ఇంట్లో వాళ్ళందరితోనూ యాంత్రి కంగా మసలుకుంటోందే తప్ప, వాళ్ళని యిదివరకటిలా గాఢంగా ప్రేమిం చలేకపోతోంది

బాబా గదంతా ఓసారి కలియ జూసింది మెహర్.

గదిలోని వస్తువులన్నీ ఎక్కడి వక్కడ పొందికగా అమర్చబడి ఉన్నయ్.

ఒకగోడకు గఫర్ ఖాన్, తాహెరాలు కలసి తీయించుకున్న ఫోటో. దాని ప్రక్కనే పిల్లలందరితోనూ కలసి తీయిం చుకున్న ఫామిలీఫోటో ఉన్నయ్. ఆ పట్టుకుని ప్రక్కనే అతనిచేత చంపబడ్డ పెద్దపులితో కలసి తీయించుకున్న ఫోటో ఉంది. ఆ ఫోటో వంకనే చాలాసేపు చూస్తూ నిల్చుండిపోయింది మెహర్.

తండ్రి మంచి వేటగాడు. వయసులో ఉండగా సంవత్సరాని కొకసారైనా వేటకు వెళ్ళి పులులను, తోడేళ్ళను, ఎలుగుబంట్లను చంపుతూండేవాడట. నాలుగైదు సంవత్సరాలనుండి అస్వస్థ తగా ఉండటంవల్ల వేటాడటం మాని వేసేడు.

అహమ్మద్ మాత్రం అప్పుడప్పుడు తండ్రి వాడిన తుపాకినే పట్టుకుని స్నేహి తులతో కలసి వెళ్ళి పావురాలను, జింక లను చంపుకు వస్తుంటాడు.

రజ్వీకి వేట అంటే పరమ అస హ్యంట. ఎన్నడూ తుపాకిని ముట్టుకుని ఎరుగడు రజ్వీ. "వట్టి పిరికిపంద" అని నవ్వుకుంది మెహర్.

ఎదురుగా టేబుల్ మీద ఖురాను, మరి కొన్ని మతగ్రంథాలు ఇంగ్లీషులోను, ఉర్దూలోను వ్రాయబడినవి వరుసగా పేర్చబడి ఉన్నయ్. ఆ పుస్తకాల మధ్య రహీం ఆరునెలల బాబుగా ఉన్నపుడు తీసిన ఫోటో ఉంది.

టేబులుకున్న సొరుగును యాదాలా పంగా లాగింది మెహర్.

సొరుగు తీయగానే ఆమెకు మొట్ట మొదట కనపడింది తుపాకీ!

ఆమెగుండె ఝల్లుమంది.

దానిని చూసి తనెందుకలా భయపడుతున్నదో తనకే తెలియదు.

వెంటనే సొరుగును అవతలకు నెట్టి వేసింది మెహర్.

ఇంతలో "ఆంటీ! ఆంటీ!" అన్న రహీం అరుపులు విని గదిలోనుండి యివతలకు వచ్చింది మెహర్.

అహమ్మద్ షాపునుండి అప్పుడే భోజనానికని వచ్చినట్లున్నాడు. తండ్రి చేతుల్లోనుండి క్రిందికిజారి ఆమెవైపుకు పరుగెత్తుకు వచ్చేడు రహీం.

"ఆంటీ! ఆంటీ! నేను షాపు కెళ్ళి వచ్చా" అన్నాడు ఆమె కాళ్లను చుట్టి వేస్తూ.

"ఎలాఉంది షాపు ?" అంటూ అతనిని ఎత్తుకుంది. రహీం "చాలా బాగుంది ఆంటీ! నువ్వుకూడా షాపుకు రాకూడదూ? అక్కడకూర్చుంటే కార్లు సైకిళ్ళు, రిక్షాలు, బస్సు ... ఎన్ని న్నాయో" అన్నాడు సంబరపడిపోతూ.

అహమ్మద్ లోపలికి వెళ్తూ "రహీం భోజనానికి రావూ?" అని కేకేసేడు.

"నువ్వు వెళ్ళు డాడీ! నేను ఆంటీతో మాట్లాడి వస్తాను" అని తండ్రిని పంపించి మెహర్‌తో "అక్కడ యింత పెద్దబస్సులు కూడా ఉన్నయ్ ఆంటీ" అన్నాడు రెండు చేతులు బారజాపుతూ.

"ఇంకా ఏమున్నాయ్?" అనడిగింది

"స్కూటర్లుకూడా ఉన్నయ్ ఆంటీ! అందులో ఒక స్కూటర్ మీద డాక్టర్ సాబ్ చిన్న ఆంటీని ఎక్కించుకుని షాపుకు వచ్చేడుకూడా"

చటుక్కున అతని మాటలకు అడ్డు తగుల్తూ "ఏమిటి? డాక్టర్‌సాబ్ షాపుకు వచ్చాడా?" అనడిగింది.

"ఔను ఆంటీ! డాడీని చూసి స్కూటర్ ఆపేడు డాక్టర్‌సాబ్. డాడీతో మాట్లాడేడు కొంచెం సేపు. డాడీ డాక్టర్ సాబ్‌కీ, ఆంటీకీ డ్రింకు-లిప్పించేడు" నాకూకూడా యిప్పించేడు" అన్నాడు బుగ్గలు సొట్టలుపడేలా నవ్వుతూ రహీం.

"ఆంటీ ఎవరురా?" అంది అసహనంగా మెహర్.

"ఆంటీయా? ఆంటీయే?" అన్నాడు యేమని చెప్పాలో తోచక రహీం.

"ఎలావుంది ఆంటీ? నా అంత ఉందా? చీరకట్టుకుందా?" అనడిగింది ఆత్రంగా.

"ఆంటీ అచ్చు నీలానే ఉంది. చాలా బాగుంది. ఎఱ్ఱచీరకట్టుకుంది. రెండుజడ లేసుకుంది" అన్నాడు రహీం ఉత్సాహంగా.

ఇంక ఆపసివాడితో మాట్లాడబుద్ధి కాలేదు మెహర్‌కి. ఆమె గుండె భగభగ

"నువ్వెళ్ళి అన్నంతిను, డాడీ కోప్పడతాడు" అంటూ అతనిని లోపలికి పంపించివేసింది.

"ఎఱ్ఱచీర, రెండుజడల ఆంట. హుం! రాత్రి నాతో అంత సేపు గడిపి, తెల్లవారేసరికి మరో స్త్రీని స్కూటరు మీద ఎక్కించుకుని జల్సాగా తిరు తున్నాడన్నమాట! ఛ! ఎంత విశ్వా ఘాతకుడు! మల్లెపూవులాటి తన ... సుని, అందులోని తన ప్రేమవరిమళా ఆస్వాదించలేకపోయేడా మూర్ఖుడు వాడిని ఏం చేసినా పాపంలేదు. వాడిని ముక్కలు ముక్కలుగా నరికినా పాపం లేదు. వాడిని-ఆ నరరూప రాక్షసుని నా జీవితంతో చెలగాటమాడిన ఆ తకుణ్ని నాశనం చేస్తాను. వాడిని నాశనంచేస్తాను" అనుకుంది, ఉద్రేకంగా పిడికిలి బిగిస్తూ మెహర్.

అసలే ఆమె మనసు గాయపడిఉంది. దానికి తోడు పాషా మాటలు పుండుమీద కారం జల్లినట్లు మరింత బాధ పెట్టినయ్. అలాటి స్థితిలో ఎలాగైనా రవీంద్రతో రాజీకి వద్దామనుకుంటున్న సమయంలో ఆ వార్త ఆమెకు అశనిపాతంలా తగిలింది.

(సశేషం)

Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-1.
Controlling Editor: "CHAKRAPANI"